# కవితా లహరి

కవితా మూర్తులు

నాచనసోముడు, పిల్లలమర్రి పినవీరభద్రుడు, జాషువా,

దాశరథి గారల

సాహిత్య వ్యక్తిత్వాల దర్పణం

ప్రసిద్ధాంధ్ర సాహిత్యాచార్యులు

ఆచార్య దివాకర్ల వేంకటావధాని, ఆచార్య బి. రామరాజు

ఆచార్య సి. నారాయణరెడ్డి, డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం

గారల ఉపన్యాసమంజరి

## ప్రచురణ



రిజిష్టర్డు నెం. 1/64

యువభారతి

సాహితీ సాంస్కృతిక సంస్థ

5 కింగ్స్‌వే, సికింద్రాబాదు - 3

KAVITHA LAHARI

A COLLECTION OF LECTURES ON
Naachana Somana, Pillalamarri Pinaveerabhadra Kavi, Jaashuva and Dasarathi.

*By*

*Prof*: Divakarla Venkatavadhani, *Prof*: B. Rama Raju,
*Prof*: C. Narayana Reeddy and Dr. G. V. Subrahmanyam.



యువభారతి

ప్రచురణ : 40
ప్రథమ ముద్రణ : ప్రతులు 15,200

15 జనవరి, 1976

ముఖచిత్ర రచన : అక్షరాలంకరణ :
శీలా వీర్రాజు

ముద్రణ :
నాగార్జున ప్రింటింగ్ వర్క్స్, హైదరాబాదు

ముఖచిత్ర ముద్రణ :
నాగలక్ష్మి ఆర్టు ప్రింటర్స్, హైదరాబాదు

ప్రతులకు :

యువభారతి

5, కింగ్స్‌వే, సికిందరాబాదు-500 003.

వెల : 6-00

[ప్రచురణ పూర్వవిరాళం రూ. 4-00 యిచ్చిన వారికి అందించాం.]

PAPER USED FOR THE PRINTING OF THESE BOOKS
WAS MADE AVAILABLE BY THE GOVERNMENT OF INDIA
AT CONCESSIONAL RATES
YUVABHARATHI IS GRATEFUL



# యువభారతి పరిచయము

మనిషిలో అంతర్లీనంగా, సంక్షిప్తంగా ఉన్న ప్రతిభా పరిణామాలు పరివ్యాప్తం కాగల్గినప్పుడే అతని సృజనాత్మక శక్తికి సార్థక్యం చేకూరుతుంది. సమాజంలో సౌందర్యం, సౌజన్యం, పెంపొందడానికి అనువైన వాతావరణం ఏర్పడుతుంది. పరస్పరావగాహనం కలుగుతుంది. నిర్మాణాత్మక దృక్పథాలకు ప్రాచుర్యం లభిస్తుంది. సమైక్యభావాలు కుదురుకుంటాయి.

యువభారతి కడచిన పన్నెండేళ్ళుగా సమాజంలో సామరస్యాన్ని పెంపొందించేందుకు సాహిత్యం కంటె ఇతరమైన సాత్విక సాధనం లేదనే విశ్వాసంతో ఇతోధిక కార్యక్రమాలను రూపొందించి కృషి చేస్తున్నది. సాధ్యమైనంత తక్కువ వెలకు వీలైనంత ఎక్కువ మందికి ఉత్తమ సాహిత్యాన్ని అందిస్తే సాహిత్యం పట్ల ప్రజానీకానికి అనురక్తి పెరుగుతుందనే నమ్మకంతో ప్రచురణ కార్యక్రమాన్ని చేపట్టింది ఇంతవరకూ 39 ప్రచురణలను ప్రచురించి రెండులక్షలయాభై వేలకు పైగా ప్రతులను సాధ్యమైనంత తక్కువ వెలకు తెలుగు పాఠకులకు అందించడానికి పూనుకున్నది.

యువభారతి సాహితీమిత్ర పథకంలో 3,500 మందికి పైగా సాహితీ మిత్రులుగా చేరారు. రానున్న ఉగాది నాటికి ఈ సంఖ్య 10 వేలకు చేరుకోవాలన్న మా లక్ష్య సాధనలో తోడ్పడండి. యువభారతి శాశ్వత జీవిత సభ్యత్వ పథకాలలో ఐదువందల మందికి పైగా భారతీ మిత్రులుగా, యాభైమంది భారతీ భూషణులుగా చేరారు. ఏ ఒక్క పథకంలోనైనా సభ్యులుగాచేరి మా 'నందిని' మాసపత్రికను ఉచితంగా పొందే అవకాశం కల్పించుకోవలసిందిగా సహృదయులకు విజ్ఞప్తి. "నందిని"లో యువభారతి కార్యకలాపాల వివరాలే కాకుండా సాహిత్యానికి సంబంధించిన అనేకాంశాలుంటాయి , ఉడుతాభక్తితో మేము చేస్తున్న భాషా సేవకు అండదండలుగా నిలిచింది ప్రజలు. వారి సౌహార్దం, భాషా ప్రియత్వం- ఇవే మా పెట్టుబడి. మా తపస్సు ఫలించి తెలుగుదేశంలో అధ్యయనశీలతా సౌజన్యం పెంపొందాలని ఆకాంక్షిస్తున్నాం.

సహృదయుల సహకారాన్ని కోరుతూ.

ఇరివెంటి కృష్ణమూర్తి

15-1-1976

అధ్యక్షుడు



# మా మాట

యేనామ కేచి దిహ నః ప్రథయం త్యవజ్ఞాం
జానంతి తే కిమపి తాన్ప్రతి నైష యత్నః
ఉత్పత్స్యతే మమతు కోపి సమానధర్మా
కాలోహ్యయం నిరవధి ర్విపులా చ పృథ్వీ. —భవభూతి

ఈ అనంతమైన కాలంలో, ఈ విశాలమైన ప్రపంచంలో తన వంటి హృదయం కలిగినవాడు ఎప్పుడైనా, ఎక్కడైనా పుట్టకపోతాడా? అని భవభూతి ఆలోచించే అన్నాడు. సాహిత్యానికి కొత్తపాతల పూతలు పులమడం అసాధ్యమనీ, స్వపర దేశ భేదములు లేవనీ భంగ్యంతరంగా ప్రవచించాడు. మనీషియైన మనిషి తన అనుభవాన్ని సువ్యక్తం చేయడానికి ప్రయత్నించినప్పుడు ఆ ప్రయత్నం సాహిత్య సృష్టికి ఆమ్రేడితం అవుతుంది. తరతరాలకు ఆ సాహిత్యం జీవిత లక్ష్యాన్ని సంకేతిస్తూ ఉంటుంది. అజ్ఞానంతో, దారిద్ర్యంతో, బర్బరత్వంతో జాతి పోరాడుతున్నప్పుడల్లా ఆ ఉత్తమ సాహిత్యం కనువెలుగును ప్రసాదిస్తుంది. ధైర్యోత్సాహాలను ఇనుమడింప జేస్తుంది. దైనందిన జీవితాన్ని రసమయం చేస్తుంది. ప్రతి వ్యక్తిని సంస్కృతి పరిరక్షణకు ఉన్ముఖుణ్ణి చేస్తుంది.

ఉత్తమ సాహిత్యాధ్యయనానికి అనువైన భూమికను ఏర్పరచడానికి యువభారతి తెలుగు జాతిని రసాత్మకంగా మలచిన మహాకవి వతంసుల సాహిత్య వ్యక్తిత్వాలను గూర్చి విజ్ఞులచేత ఉపన్యాసాలిప్పించి వాటిని పుస్తకరూపంలో ప్రచురించి జన బాహుళ్యానికి అందుబాటులో ఉండే పద్ధతిలో అందించింది. ఈ కార్యక్రమాల రూపకల్పనకు తోడ్పడి తమ తొమ్మిది ఉపన్యాసాలను, వ్యాసాలను ప్రసాదించి యువభారతికి సముత్సాహాన్ని, ఆశీరమృతాన్ని అందించిన వాఙ్మయ దివాకరులు ఆచార్య దివాకర్ల వేంకటావధాని గారికి యువభారతి ఈ సందర్భముగా భక్తి పురస్సరమైన అభివాదాలను సమర్పించుకుంటున్నది.

ఇంత వరకు వెలువడినవి కావ్యలహరి, చైతన్యలహరి, వికాసలహరి, ప్రతిభాలహరి. ఈ మంజరిలో 'కవితాలహరి' ఐదవది.

నాచన సోమనాథుడు, పిల్లలమర్రి పినవీరభద్రుడు, జామువా, దేవులపల్లి కృష్ణశాస్త్రి, దాశరథి గారల సాహిత్య వ్యక్తిత్వాలకు సంబంధించింది ఈ కవితాలహరి.

నాచనసోముడు తనకంటె పూర్వమున్న కవితారీతులకంటె కొత్త గుణాలను ప్రదర్శించిన వాడు పిల్లలమఱ్ఱి ప్రబంధ కవితామార్గానికి అంకురార్పణ చేసినవాడు. జాషువా బ్రతుకు బాధల చేదును ఆస్వాదించి మధురమైన కవిత ద్వారా సంకుచిత మతాతీతమైన కవితలను వెలువరించినవాడు, కృష్ణశాస్త్రి కాల్పనిక కవితా పథానికి దిగ్దర్శనం చేసినవాడు, దాశరథి యుగోచితాగ్రగామిత్వంతో సమకాలీన సాహిత్యోద్యమాలు కల్గించిన సంస్కారంతో శాశ్వతమైన శాంతిని పరికల్పించి పరి రక్షించడానికి ఆలోచనాలోచనాలతో తిమిరంతో సమరం జరుపుతున్నవాడు. ఈ ఐదుగురు కొత్త పుంతలను సృష్టించుకొని పయనించిన వారే. అనుకరణ లకు దూరంగా నిలిచి సాహిత్య సృష్టి చేసి తమ పార్థక్యాన్ని నిలుపుకోగల్గిన ధన్య జీవులు. నాచన సోమనాథుని గూర్చి ఆచార్య దివాకర్ల వేంకటావధాని గారు, పిల్లల మఱ్ఱి వానిని గురించి ఆచార్య బి. రామరాజుగారు, జాషువాను గురించి ఆచార్య సి. నారాయణరెడ్డిగారు, కృష్ణశాస్త్రిని గురించి ఆచార్య యస్వీ జోగారావుగారు, దాశరథిని గురించి డా॥ జి. వి. సుబ్రహ్మణ్యంగారు యువభారతి వేదికనుండి సహస్ర రసిక జనాభిరామంగా ప్రసంగించి వ్యాసాలను అందించారు. అనివార్యమైన కారణాల వల్ల కాబోలు ఆచార్య జోగారావుగారు వ్యాసాన్ని అందించలేకపోయారు. అందుకే ఇందులో పొందు పరచలేక పోతున్నాం.

ఉపన్యాసాలిచ్చి వ్యాసాల నందించిన ఈ సాహిత్యాచార్యులకు యువభారతి కృతజ్ఞతా పూర్వకమైన అభివదనాలను సమర్పించుకుంటున్నది. మా ఉపన్యాస మంజరీ కార్యక్రమాలకు అధికాధిక సంఖ్యలో విచ్చేసి, మమ్మల్ని ప్రోత్సహించిన భాషాభిమాను లకు మా నమస్సులు. జంట నగరాలలోని వారే కాక ఇతర ప్రదేశాల నుండి కూడా ఉపన్యాసాలను వినడానికి వచ్చిన భాషా బంధువులకు మా నమస్సులు.

ఉపన్యాస మంజరీ కార్యక్రమాలను మరింత ప్రయోజనాత్మకంగా రూపొందించా లని యువభారతి సమాలోచనలు చేస్తున్నది. పదమూడవ వార్షికోత్సవ సందర్భంగా లహరీ కార్యక్రమాలను నిర్వహించే తీరుతెన్నుల్లో మార్పులూ, చేర్పులూ, కూర్పులూ చేయాలని ఆలోచిస్తున్నాం. పఠితృ లోకం ఈ సందర్భంగా తమ అమూ ల్యాభిప్రాయాలను తెలుప వలసిందిగా ప్రార్థిసున్నాము. సాధ్యమైనంత వరకూ అంద రికీ నచ్చే విధంగానే మా కార్యక్రమాలు రూపొందించాలనే మా ఆకాంక్ష. "పాల కొత్తల మేలు కలయిక క్రొమ్మెరుంగులు జిమ్మ" నట్లుగానే మా యువభారతి భాషోద్యమాన్ని నిర్వహిస్తుందనీ విన్నవించుకుంటున్నాము.

మాకు తోడ్పడుతున్న వారు ఎందరో మహానుభావులు అందరికీ వందనములు.

ఇరివెంటి కృష్ణమూర్తి
అధ్యక్షుడు

15-1-76




# కవితా లహరి

## ఉపన్యాస మంజరి కార్యక్రమాల వివరణ

స్థలం:- ఆంధ్ర సారస్వత పరిషత్తు భవనాలు,
తిలక్ రోడ్, హైదరాబాదు - 500 001.

సమయం: సాయం కాలం గం॥ 5-30 ని॥లు

**మొదటి సమావేశం** **9-11-1975** **ఆదివారం**

కవితామూర్తి : నాచన సోమనాథుడు

ఉపన్యాసకులు : ఆచార్య దివాకర్ల వేంకటావధాని గారు

అధ్యక్షులు : శ్రీ దేవులపల్లి రామానుజరావు గారు
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ కార్యదర్శులు

ముఖ్యఅతిథులు: శ్రీ అల్లాడి కుప్పుస్వామి గారు
ఆంధ్రప్రదేశ్ హైకోర్టు న్యాయమూర్తులు

**రెండవ సమావేశం** **23-11-1975** **ఆదివారం**

కవితామూర్తి : పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు

ఉపన్యాసకులు : ఆచార్య బి. రామరాజు గారు

అధ్యక్షులు : శ్రీ గడియారం రామకృష్ణశర్మ గారు
ఆంధ్ర సారస్వత పరిషత్తు కార్యదర్శి

ముఖ్యఅతిథులు: డా॥ బెజవాడ గోపాలరెడ్డి గారు
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ అధ్యక్షులు

**మూడవ సమావేశం** **14-12-1975** **ఆదివారం**

కవితామూర్తి : జాషువా

ఉపన్యాసకులు : ఆచార్య సి. నారాయణరెడ్డి గారు

అధ్యక్షులు : డా॥ పి. ఎస్. ఆర్. అప్పారావు గారు
అంతర్జాతీయ తెలుగు సంస్థ డైరెక్టరు

ముఖ్యఅతిథులు : 'చలం ఆలోచనలు' ఆవిష్కర్తలు :
శ్రీ కె. జయచంద్రారెడ్డి గారు
ఆంధ్రప్రదేశ్ హైకోర్టు న్యాయమూర్తులు

**నాలుగవ సమావేశం 21-12-1975 ఆదివారం**

కవితామూర్తి : దేవులపల్లి కృష్ణశాస్త్రి

ఉపన్యాసకులు : ఆచార్య యస్వీ. జోగారావు గారు

అధ్యక్షులు : కళాప్రపూర్ణ, పద్మశ్రీ బోయి భీమన్న గారు

ముఖ్యఅతిథులు : భారతనారి-నాడు-నేడు ఆవిష్కర్తలు
శ్రీ అక్కిరాజు వాసుదేవరావు గారు

**అయిదవ సమావేశం 4-1-1976 ఆదివారం**

కవితామూర్తి : మహాకవి దాశరథి

ఉపన్యాసకులు : డా॥ జి.వి. సుబ్రహ్మణ్యం గారు

అధ్యక్షులు : శ్రీ ఎం. ఎస్. రాజలింగం గారు
గవర్నమెంట్ ప్లీడర్ అండ్ పబ్లిక్ ప్రాసిక్యూటర్

ముఖ్యఅతిథులు: తిమ్మన కవితావైభవం, తులసీదాసు కవితావైభవం, ధూర్జటి కవితా వైభవం ఆవిష్కర్తలు:
శ్రీ ఆమంచర్ల గంగాధరరావు గారు
ఆంధ్రప్రదేశ్ హైకోర్టు న్యాయమూర్తులు

బహుమతి ప్రదానం : శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవి గారు

# కవితాలహరి

## అనుక్రమణిక

# నాచన సోమనాథుడు

~ ఆచార్య దివాకర్ల వేంకటావధాని

ఆంధ్ర వాఙ్మయమున కవిత్రయము వారి తరువాత వారితో సమానుఁడుగనో వారిలో నొకరిద్దరికంటె నధికుఁడుగనో పరిగణింపఁబడి విమర్శకుల మన్ననల నందినవాఁడు నాచన సోమనాథుఁడు. కీ.శే. వీరేశలింగం పంతులుగా "ఇతని కవిత్వము కవిత్రయము వారిలో ననేకుల కవిత్వముకంటెఁ బ్రశస్తముగా నుండు" నని వ్రాసి యుండిరి. ఇచ్చట ననేకు లనఁగా తిక్కన యొక్కఁడుఁదక్క మిగిలిన యిరువురు నని వారి యభిప్రాయము. చిన్నయసూరి యితనిని "అలికంబున నక్షిని డాచినట్టి సర్వజ్ఞుఁ"డని ప్రశంసించి యుండెను, కీ. శే. బహుజనపల్లి సీతారామాచార్యుల వారితని యుత్తర హరివంశము "మిక్కిలి ప్రౌఢముగాను భారతమున కంటె నెల్ల విధముల విశేషించినదిగాను గానంబడుచున్న" దని వ్రాసి యుండిరి. ఇతఁ డుత్తర హరివంశమునే కాక వసంతవిలాసము, హరివిలాసము అను గ్రంథములను కూడ రచించి యుండినట్లు లక్షణ గ్రంథములం దుదాహరింపఁబడిన పద్యములను బట్టి తెలియుచున్నది. వసంత విలాసము మాచయబ్రహ్మయ కంకితము చేయఁబడిన దని తెల్పి కీ.శే. మానవల్లి రామకృష్ణ కవిగా రందలి మొదటి పద్యము నుదాహరించి యున్నారు. ఈ గ్రంథ మిప్పుడు లభించుటలేదు. అప్పకవియు వెల్లంకితాతంభట్టును క్రమముగా నాచన సోమనాథునివని యుదాహరించిన "నాతో మార్కొనలేరు" "ఆపాదశిరో లంకారాపాదిత" ఇత్యాది పద్యము లేగ్రంథములలోనివో తెలియ వచ్చుటలేదు. కస్తూరి రంగకవి రంగరాట్ఛందమున నాచన సోమనాథుని హరివిలాసములోని వని నాల్గు కంద పద్యముల నుదాహరించి యున్నాఁడు. ఆ హరివిలాసము కూడ నిప్పుడు లభించుటలేదు. దానిపేరు హరివిలాసమో హరవిలాసమో సంశయ గ్రస్తముగానున్న దనియు, వసంత విలాసమే ఆ పేరఁ బేర్కొనఁబడినదో లేక అది వేఱు గ్రంథమో తెలియుట లేదనియు కీ.శే. చాగంటి శేషయ్యగారు వ్రాసియున్నారు. నాచన సోమనాథుని ఉత్తర హరివంశ మొక్కటే యిప్పుడు లభ్యమగుచున్నది.

నాచన సోమనాథుఁడు నియోగి బ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు. భారద్వాజ గోత్రుఁడు; యజుశ్శాఖీయుఁడు; సకలాగమవేది; అష్టాదశ పురాణాభిజ్ఞుఁడు; అష్ట భాషా కవిత్వ నిపుణుఁడు. ఇతనికిని మఱి యైదుగురు బ్రాహ్మణులకును గలపి బుక్క రాయలు పెంచుకలదిన్నె యను గ్రామమును దానము చేసియున్నట్లు తెల్పు నొక శాసనమున నితనిని గూర్చి "సోమయ నాచనాంభోదేః సోమాయా మితతేజసే" అని కలదు. దీనిని బట్టి యితఁడు నాచన సముద్రమునకు చంద్రుఁడని తెలియుచున్నది. ఈ నాచన యనునది తండ్రి పేరైనను వంశము పేరైనను గావచ్చును. కాని కాకతీయ కవియైన ఎఱ్ఱనకవి "నాచనసుతు సోము" నని స్పష్టముగా చెప్పియుం డుట చేతను, కొఱవిగోప రాజకవి "నాచిరాజు సోమన" యనియు, వినవీరభద్రుఁడు "నాచిరాజు సోము" అనియు నితనిని పేర్కొని యుండుటచేతను అది యితని తండ్రిపేరే అని నిశ్చయింప వచ్చును. పై శాసనమును బట్టియే యితని కాలమును గూడఁ గొంచె మించు మించుగాఁ దెలిసికొనుట కవకాశము కలుగుచున్నది. బుక్క రాయలు పెంచుకలదిన్నె గ్రామముపేరు బుక్కరాయ పురమని మార్చి దానిని "అలం కృతే శకస్యాబ్దే రస భూనయనేందుభిః తారణాబ్దే చైత్రమాసే నవమ్యాం శుక్లపక్షసే" అనగా రసభూనయనేందు సంజ్ఞకమైన శకాబ్దమునకు సరియైనతారణవత్సరమున చైత్ర శుద్ధ నవమి నాఁడు నాచనసోమనాథునికిని మఱియైదుగురు బ్రాహ్మణులకును దానము చేసినట్లు పై శాసనమున చెప్పఁబడినది. రస = 6; భూ = 1; నయన = 2; ఇందు = 1. అంకానాం వామతోగతిః అను సంప్రదాయమును బట్టి ఆ సంవత్సరము 1216 శతాబ్దమగును. అనఁగా క్రీ. శ. 1216 + 78 = 1294. మఱియొక శాసన ప్రతిలో రసభూనయనేందుభిః అనుచోట రసాభ్రనయనేందుభిః అను పాఠము కలదు. దీనిని బట్టి ఆ సంవత్సరము (అభ్ర = ౦) 1206 + 78 = 1284 అగును. 1294 వ సంవత్సరము తారణాబ్దము కాదు. కావున అది పొఱపాటే. 1284 వ సంవత్సరము తారణాబ్దమే కాని యప్పటికి దాతయైన బుక్కరాయలు జన్మించియైన నుండలేదు. పై శాసనము నందలి "విద్యాభిధాననగరీ విజయోన్నతశాలినీ విద్యారణ్యకృతా తస్యాం రత్నసింహాసనే స్థితః" అను పాదములను బట్టి దాన కాలమునకు విజయనగర నిర్మా ణమై యుండినట్లు తెలియుచున్నది. అందుచే తన్నగర నిర్మాణానంతరమే శాసనము వేయింపఁబడినదనుటలో సందేహము లేదు. విజయనగరము నేలిన మొదటి రాజు బుక్కరాయల అగ్రజుఁడైన హరిహరరాయలు. అతఁడు శక 1258 (క్రీ. శ 1336)వ సంవత్సరమున విద్యారణ్యస్వామి ఆజ్ఞననుసరించి పట్టాభిషిక్తుఁ డైనట్లు తెలియుచున్నది.

అతని తరువాత తమ్ముఁడైన బుక్కరాయలు సింహాసనమధిష్ఠించి 1355 నుండి 1377 వఱకును పాలనము సాగించినట్లు శ్రీ కొమఱ్ఱాజు లక్ష్మణరావు పంతులు గారును. శ్రీ చిలుకూరి వీరభద్రరావు పంతులుగారును నిర్ణయించి యున్నారు. విద్యానగర నిర్మాణానంతరమే పైశాసనము వెలసిన కారణమున రసాభ్రనయనేందుభిః (1206 = 1284) అను పాఠమును సవరింపవలసిన అక్కఱ యేర్పడినది. రైసు పండితుఁడు శాసన సంవత్సరమును సాధారణగను రసాభ్రనయనేందుభిః అనుదానిని కరాజనయనేందుభిః గాను మార్చి (కర = 2 ; అజ = 9 ; నయన = 2 ; ఇందు = 1 = శక 1292 క్రీ. శ. 1370) శాసన కాలమును క్రీ. శ. 1370 గా నిర్ణయించెను. ఈ సంవత్సరము బుక్కరాయల పాలన కాలమునందే యున్నది కాని శాసనమునందలి పదములను యథేచ్ఛముగా మార్చివేయుట జరిగినది, అందుచే కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు నాగరిలిపిలో భ్ర, భూ. అను అక్షరములకుర్తు అను నక్షరమునకును సన్నిహిత సాదృశ్యముండుననియు, శాసనమును జదివినవారు పొఱపాటున ర్తు అను దానిని భూ గను భ్ర గను చదివి యుందురనియు తెల్పి పాఠమును రసర్తునయనేందుభిః అని సవరించిరి. అప్పుడు శాసన కాలము (రస = 6, ర్తు. = 6; నయన = 2 ; ఇందు = 1 = 1266 + 78) క్రీ. శ. 1344 అగును. అది తారణ సంవత్సరమే. కాని యప్పటి కింకను బుక్కరాయలు సింహాసన మధిష్ఠించి యుండని కతమున అతఁడు దానము చేయుట యెట్లను సందేహ ముదయింపవచ్చును. దానికి ప్రభాకరశాస్త్రిలుగారు హరిహరరాయలే రాజ్యము చేయుచుండినను బుక్కరాయలు యువరాజుగా నుండెననియు, సర్వసమర్థుఁడైన యతఁడే విద్యానగరమును నిర్మింపఁజేసి దాని కాపేరు పెట్టి యుండెనని చెన్నరాయపట్నం తాలూకాలోని యొక శాసనము తెల్పుచున్నదనియు తెల్పి అన్న రాజ్యము చేయుచుండినను తమ్ముఁడు దానము చేయుటలో నాక్షేపము లేదని సమాధానము చెప్పియున్నారు. వారు చేసిన సవరింపును, చెప్పినసమాధానమును యుక్తములుగనే యున్నవి. అందుచే శాసన కాలము క్రీ. శ. 1344 అని నిర్ణయింప వచ్చును. అప్పటికి నాచన సోమన ముప్పదికిని నలువదికిని నడిమి వయసువాఁడై యుండునని భావించినచో నతడు ఎఱ్ఱనకు కొంతవఱకు సమకాలికుఁడయ్యును వయస్సున నతనికంటెఁ గొంచెము చిన్నయని తలంప వచ్చును.

హరివంశమునకు భారత పరిశిష్టమనియు, భారతఖిలపర్వమనియు పేరులున్నవి. సంస్కృతమున హరివంశము కొన్నిప్రతులలో పూర్వోత్తర భాగములు గను కొన్నిప్రతులలో పర్వత్రయాత్మకముగను విభజింప బడియున్నది. హరివంశ

పర్వము, విష్ణుపర్వము, భవిష్య పర్వము అనునవి మూడును అందలి పర్వములు. హరివంశ పర్వమును విష్ణుపర్వము నందలి మొదటి 61 అధ్యాయములును కలిసి పూర్వభాగమును, విష్ణుపర్వము నందలి తుది 68 అధ్యాయములను భవిష్య పర్వమును కలసి ఉత్తర భాగమునను అందు నిర్ణయింపఁబడినవి. ఎఱ్ఱాప్రెగ్గడ పర్వవిభజనమునుగాక పూర్వోత్తరభాగ విభజనముననే అనుసరించెను. కానిమూలము నందలిపూర్వోత్తరభాగ విభజనమునకును ఎఱ్ఱన హరివంశమందలి భాగవిభజనమునకును కొంచెము భేదమున్నది. మూలమున పూర్వభాగము విష్ణుపర్వము నందలి 61 అధ్యాయముతో ముగియుచుండ ఎఱ్ఱన పూర్వభాగ మా పర్వమునందలి 38 వ అధ్యాయముతోనే ముగియుచున్నది. నాచన సోమనాథుఁడు కూడ పర్వత్రయ విభజనమునుకాక పూర్వోత్తర భాగ విభజనమునే అనుసరించెను. అతని ఉత్తరహరివంశము బలదేవ మాహాత్మ్య నరకాసుర సంహారములతో నారంభించుచున్నది. మూలమునందలి ఉత్తరభాగము కూడ బలదేవ మాహాత్మ్యముతోఁగూడిన విష్ణుపర్వమునందలి 62 వ అధ్యాయముతో నారంభమగుచున్నది. ఎఱ్ఱన సోమన లిరువురును ఆంధ్రమున తమ గ్రంథములను ఆశ్వాసములుగా విభజించి యుండిరి.

సోమనాథుని ఉత్తరహరివంశ మొక్కటే యిప్పుడు లభ్యమగు చుండుటచే నతఁడు పూర్వ హరివంశమును రచించెనా లేదా అను ప్రశ్న ముదయించుచున్నది. ఈ విషయమున పెక్కు వాదోపవాదములు జరిగి యున్నవి. కొందరు సోమనాథుఁడు పూర్వహరివంశమును కూడ రచించి యుండెననియు, గొందరాతఁ డుత్తర హరివంశమును మాత్రమే రచించెననియు నభిప్రాయ పడియున్నారు. ఇరుపక్షముల వారును తమ తమ వాదములను సమర్థించుటకు హేతువులు చూపియున్నారు. సోమన పూర్వ హరివంశమును కూడ రచించియుండునని చెప్పువారి వాదమే బలవత్తరముగా కనవచ్చుచున్నది.

కవులేదైన కావ్యమును రచించునప్పు డారంభమున నిష్టదేవతా ప్రార్థన, పూర్వకవిస్తుతి, కావ్యరచనాసందర్భము మున్నగు వానితోఁగూడిన అవతారికను వ్రాయుట పరిపాటి. ఉత్తరహరివంశమున నట్టి అవతారికలేదు. అది నేరుగా కథతోడనే ఆరంభమగుచున్నది. సోమన అట్టి అవతారికను పూర్వహరివంశారంభమున వ్రాసియుండుటచే నుత్తరహరివంశమున నది వ్రాయవలసిన అవశ్యకత లేకపోయినది. ఉత్తర హరివంశము కృతిపతి సంబోధనానంతరము "దేవా! వైశంపాయనుఁడు జనమేజయుని కిట్లనియె"నను వచనముతో నారంభమగుచున్నది, వైశంపాయనుఁడు జనమే

జయుని "హరివంశ ప్రథమ కథాంతరమునఁగల వింతవెల్లఁ దప్పక మదిలోఁ దిరమయ్యె గదా మీఁదట నరవర! యే కథ లోకో వినం బ్రియమ"ని అడుగ జనమేజయుఁడు బలదేవులావు మునువిని మరియుం దనియదు మది ముద మొదవఁగ వినగోరెడుఁ జెప్పవే వివేకనిధానా" అని వేడియుండెను. దీనినిబట్టి జనమేజయుఁడు హరివంశ ప్రథమకథయైన పూర్వభాగము నందలి విషయములన్నియు గ్రహించె ననియు నందు బలరాముని బలపరాక్రమములను గూర్చి వినియు తనియక యింకను వివరింపు మని వైశంపాయను నడిగెననియుఁ దెలియుచున్నది. "సంస్కృతము నందలి పూర్వ హరివంశములోని కథలన్నియు వింటివి గదా. ఇంక నిప్పుడే కథలు వినవలతు"వని వైశంపాయనుఁడు జనమేజయు నడిగెనని చెప్పుట ఉచితముకాదు. ఆ హరివంశ ప్రథమ కథ నాచనసోమనాథుని ఆంధ్రపూర్వ హరివంశమేయై యుండవలెనని తోఁచు చున్నది. భారతేతిహాసము రచించినపిమ్మట వ్యాసుఁడు దానిపరాంశముగా పూర్వోత్తర భాగములతోఁగూడిన హరివంశమును రచించెను. నాచన సోమనాథుఁ డుత్తర హరివంశ గద్యలలో "బుధారాధన విరాజి తిక్కనసోమయాజి ప్రణీతంబైన శ్రీ మహాభారత కథా నంతరంబున ... సోమనాథ ప్రణీతంబైన యుత్తరహరివంశంబునం"దని వ్రాసి యుండెను. సోమయాజి భారతమునందలికథ పాండవుల స్వర్గారోహణముతో ముగియు చున్నది. దాని యనంతరము పూర్వహరివంశ కథ వ్రాయుట యుచితముకాని దానిని మాని ఉత్తరహరివంశకథ వ్రాయుట యుచితముకాదు. ఒకవేళ ఉత్తరహరి వంశభాగమునే సోమన వ్రాయసంకల్పించినచో శ్రీ మహాభారత కథానంతరమున అని చెప్పవలసిన అక్కఱ లేదు. మరియు నతఁడు పూర్వ హరివంశమును విడిచిపెట్టి ఉత్తరహరివంశమును మాత్రమే వ్రాయవలసిన ప్రత్యేకకారణ మేదియు లేదు. హరివంశ పఠనశ్రవణ రచనా లేఖనముల వలనఁ గలుగుఫలము సమష్టిగా హరివంశమున కంతకును చెప్పఁ బడినదికాని వ్యష్టిగా నుత్తరహరి వంశమునకు మాత్రమే చెప్పఁబడి యుండలేదు. కీ. శే. నడకుదుటి వీరరాజుపంతులుగా రాంధ్ర సాహిత్య పరిషత్పత్రికలో రచించిన యొక వ్యాసమున శ్రీమదోగిరాల జగన్నాథ కవిరాజుగారు తమ సుమనోమనోభిరంజన కావ్యమునకు వ్యాఖ్యానము వ్రాయుచు రేఫసంయుక్తవర్ణ పూర్వాక్షరమునకు లఘుత్వము కలుగుట దోషముకాదనుటకు నాచన సోమనాథుని దని 'శతతాళ దఘ్నహ్రదమున నుఱికెన్" అను ప్రయోగము నుదహ రించెననియు, నది ఉత్తర హరివంశమున కానవచ్చుటలేదనియు, సందర్భమునుబట్టి చూడ నది శ్రీకృష్ణుఁడు కాళియహ్రదమున నుఱికిన సందర్భమునకు సంబంధించినదిగా తోఁచుచున్నదనియు, నా సందర్భము పూర్వహరివంశముననే వచ్చుననియు, కవిగారే స్వయముగా ముద్రించుకొన్న గ్రంథములోని ఆ యుదాహరణమును ప్రక్షిప్తముగా

కాని లేఖక ప్రమాదజనితముగా కాని భావించుట కవకాశములేదనియు నిది సోమన పూర్వహరివంశమును కూడ వ్రాసెననుటకు నిదర్శనమగు చున్నదనియు వ్రాసి యుండిరి. వారు చూపిన హేతువు సులభముగా త్రోసిపుచ్చ దగినదికాదు. అందుచే బలవత్తరములైన యితర హేతువులు లభ్యములగు నంతవఱకు నాచనసోమనాథుడు పూర్వహరివంశమును కూడ రచించెనని భావించుటయే సమంజసముగా నుండును.

ఉత్తర హరివంశమున నాఱాశ్వాసము లున్నవి. ఈ ఆఱింటిలో మొదటి ఆశ్వాసమున నరకాసురవధయు, ద్వితీయాశ్వాసమున కృష్ణుడు మృతులైన బ్రాహ్మణ పుత్త్రిలను దెచ్చి బ్రాహ్మణుని కిచ్చుట, ఘంటాకర్ణుడను పిశాచరాజునకు దేవేంద్రత్వ మొసంగుట, పుత్రార్థియై శివునిగూర్చి తపస్సొనరించి కృతకృత్యుడగుట అను వృత్తాంతములును. తృతీయాశ్వాసమున పౌండ్రక వాసుదేవ వధయు. చతుర్థాశ్వాస హంసడిభక వృత్తాంతమును, పంచమషష్ఠాశ్వాసములం దుషాపరిణయ బాణాసుర గర్వ భంగ వృత్తాంతములును వర్ణింపబడినవి.

ప్రస్తుతము లభించుచున్న సంస్కృతహరివంశము నందలి యుత్తరభాగములతో సోమనాథుని యుత్తరహరివంశమును బోల్చి చూచినచో నతడు దానిని యదాతథముగా ననువదించుటకు యత్నింపలేదని తెలియవచ్చును. అతడు తన కిష్టములైన, తన ప్రయోజనమునకు సాధనములైన కొన్ని కథలను మాత్రమే గ్రహించి దాని నతి స్వతంత్రమార్గమున వెలయించెను. మూలమునందలి పెక్కుకథల నాతడువిడిచివైచెను. వానిలో పారిజాతాపహరణ పుణ్యకవ్రతకథలు, భానుమతీహరణము, నికుంభవధ. ప్రభావతీప్రద్యుమ్నవివాహము వజ్రనాభవధ మున్నగునవి ముఖ్యములైనవి. గ్రహించిన కథలను కూడ నతడు తన యిచ్ఛవచ్చినట్లు వెనుక ముందులుగా మార్చెను. మూలమున విష్ణుపర్వము నందే-అనగా నరకాసురవధకు దరువాతను కృష్ణుని కైలాస యాత్రకు బూర్వమునను-ఉన్న బాణాసురవృత్తాంతము నతడు చివరి రెండాశ్వాసలలో వర్ణించెను. అట్లే మూలమున జివరనున్న హంసడిభకోపాఖ్యానము నతడు చతుర్థాశ్వాసమున జొప్పించెను. అతడు భవిష్యపర్వమునందలి కలియుగ జపతపోయోగ వర్ణాశ్రమాచారవర్ణనములను విడిచి వైచినను అందలి పెక్కుకథలను గ్రహించెను. కృష్ణబలరాములు సాందీపనికడ విద్యనభ్యసించుటయు కృష్ణుడు గురుదక్షిణగా నతని మృతపుత్త్రుని పునర్జీవితునొనరించి యిచ్చుటయు ఎఱ్ఱన పూర్వహరివంశము చివర నున్నది. బాణాసుర వృత్తాంతమందలి 'నిండారుతెగగొని' అనుసీసపద్యమును "చేతుల కసివో" అను కందపద్యమును ఎఱ్ఱన సోమనల రచనలు రెండింటియందు గానవచ్చు

చున్నవి. దీనిని బురస్కరించుకొని కొందఱు ఎఱ్ఱన సోముని తరువాతివాఁడనియు, నా పద్యములను సోముని ఉత్తరహరివంశము నుండి గ్రహించెననియుఁ జెప్పుచున్నారు. కానియట్లనుట సమంజసము కాదు. ఆపద్యములు ఎఱ్ఱన హరివంశపు టముద్రిత ప్రతుల న్నింటఁ గనవచ్చుచుండ సోమన ఉత్తరహరివంశపు టముద్రితప్రతుల కొన్నింటనే కన వచ్చుచున్నవి. ఆ పద్యములందలి యభిమానముచే కొన్నింటనే లేఖకులు వానిని రెండింటఁ జొప్పించి యుందురు. సోమన యెఱ్ఱన కంటెఁ జిన్నవాఁడైయుండుననుటలో సందేహము లేదు. ఎఱ్ఱన రచనయే పూర్వమై యుండును. వారిరువురు నొండొరుల రచనా విషయము నెఱుఁగక యుండవచ్చును. ఎఱింగినను సోముఁడు తన ప్రణాళిక భిన్నమగుటచే సమాన వస్తువిచికిత్సలేక తన రచన సాగించియుండవచ్చును.

సోమన ఉత్తర హరివంశమును స్థూలముగాఁ బరికింప నందలి కథల కొండొంటికి సంబంధము లేక పోవుటచేనందు వస్త్వైక్యము కొఱవడినట్లు కనిపించును. కానిసూక్ష్మము గాఁ బరిశీలించు వారి కంతర్గతముగా నొక సంబంధముగోచరింపపోదు. అది శ్రీకృష్ణ నాయకత్వము. అందలి కథలన్నింట కృష్ణుఁడే నాయకుఁడు. సోమన కృష్ణుని పరబ్రహ్మ త్వమును రూపొందించెను. ఆ విషయము నాతఁడు కొన్ని కథలలో వాచ్యముగను కొన్నింటిలో వ్యంగ్యముగను బ్రకటించెను. నరకాసురవధానంతరము భూదేవి కృష్ణుని జగము "లన్నియుఁ బుట్టింప బెంపఁ దుంపఁబురుషులు ముగురై పుట్టినవేలుపవఁట" అని వర్ణించెను. కృష్ణుఁడును ఆమె నోదార్చుచు" దుష్ట శిక్షణంబును శిష్టరక్షణంబును జేయ నవతరించిన నాకుం బుత్త్ర మిత్రాదులని చూచుట ధర్మంబుగా"దని తన యవతారపురుష త్వమును వాచ్యముగనే చెప్పివైచెను. బ్రాహ్మణపుత్త్రపునర్జీవన వృత్తాంతము నొక విధ ముగా నర్జున గర్వభంగమనియుఁ జెప్పవచ్చును. అర్జునుఁడు ధనుర్విద్యాగేసరుఁడగుటచే యముని నిరోధింపఁ గలనని భావించెను. కాని యట్లు చేయలేక పోయెను. కృష్ణుఁ డర్జున సారథికమైనరథముపై నరుగునప్పుడు సముద్రము ఊరూపముదార్చి దారియిచ్చుటయు, సప్తపర్వతములు తెఱపి యిచ్చుటయు, కృష్ణుఁడు భయంకర కర్దమ సంతమసమును ఛేధించుటయు, తేజోరూపుఁడైన పురుషునందుఁ జొచ్చి మృతవిప్ర పుత్త్రులఁదెచ్చుటయుఁ, దిరుగు ప్రయాణము క్షణములో ముగించుటయు నతని పరబ్రహ్మత్వమునకు నిదర్శ నములు. అర్జునుఁ డడుగఁ గృష్ణుఁ డాతేజోరూపము తన ప్రకృతియనియు, అక్షరత్రయ రూపమై యఖిలయోగమూలమగు ప్రణవము తనమూర్తి యనియు నెఱింగించెను. కృష్ణుఁడు ఘంటాకర్ణుని దివ్యరూపునిగా నొనర్చి యతని కింద్రత్వమిచ్చుట పర బ్రహ్మము తప్ప నన్యులు చేయలేని కార్యము. కృష్ణుఁడు పుత్రార్థియై శివునిగూర్చి

తపస్సొనరింపఁబోవుట శివాధిక్యమునే సూచించును. కాని శివుడు తన తపమునకు భంగమొనర్చిన మన్మథునంగరహితు నొనరించుటచే కృష్ణుఁడు మరల నాతనిఁ బుత్రునిగాఁ బడయుట కాతని యనుమతి పొందవలసిన యవసరమున్నది. తపస్సా యంగీకార ప్రాప్తికి సాధనము. శివుఁడు పుత్రి నొసంగి కరములు మొగిచి కృష్ణుని స్తుతించు సందర్భమున నాతని పరమాత్మగను విశ్వేశ్వరునిగను నిరూపించెను. పౌండ్రక వాసుదేవుఁడు సామాన్యుడు కాఁడు. కృష్ణుఁడే యతనిని గూర్చి "నాకును వానికి సాటిగాని యెవ్వరికిఁ దరంబు గాదు యదువంశము ప్రింగుచునుండు"నని చెప్పి యుండెను. అట్టి వానిని వధించుట కృష్ణుని యతిలోక మహిమాను భావములకుఁ దార్కాణ. నారదుఁడు పౌండ్రకుని ప్రగల్భములు విని యోర్వక యతని మంద వించిన పల్కులలో కృష్ణుని యధీశ్వరత్వము ద్యోతితమగు చున్నది. తృతీయాశ్వాసము చివరఁగల కాశీపతి వృత్తాంతము పౌండ్రకవధ కనుబంధమే. కాశీపతి పౌండ్రకునికి సహాయుఁడు. అతడు పంపిన కృత్యను చక్రముచే నీఱుచేసి కాశిని కాల్చుట కృష్ణుని మహానుభావతకు నిదర్శనము. హంసడిభకులు శైవాత్మకులు; వరలాభ గర్వితులు. శివుఁడు వారికి సర్వాస్త్రము లొసంగుటయే కాక ప్రమథద్వయమును గావలిగా నేర్పఱి చెను. దుర్వాసుఁడు కృష్ణుని నుతించుచు "వేదాంతములనైన వెదకనందని రూపు విజ్ఞాన రూపమై వెలయురా" వని యతని పరబ్రహ్మతను నిరూపించెను. కృష్ణుడు హంసడిభకులను రూపుమాపుటయేకాక మాహేశ భూతద్వయమును గైలాసాద్రిపైఁ బడునట్లుగా విసరివైచి తన యతిలోకపరాక్రమమును బ్రదర్శించెను. పుష్కరతీర నివాసులైన మునులు "దేవదేవు నద్దేవునిఁ దెలియువారు దేవదేవుని రూపంబు, దెలి యువా" రని సంస్తుతించిరి. చతుర్థాశ్వాసాంతమున యశోదానందులు కృష్ణునిఁ జూడ వచ్చినప్పుడు కృష్ణుడు వారి నాదరించిన విధ మతని కృతజ్ఞతభావమునకుఁ బరమ నిద ర్శనము. తుది రెండాశ్వాసములందలి ఉషాపరిణయ వృత్తాంతమును బాణాసుర గర్వ భంగమవికూడ భావింపవచ్చును. కృష్ణుఁడు బాణాసురుని చేతులు ఖండించి శివుని ప్రార్థనపై నాతనిఁ జంపక విడిచెను. ఆ యుద్ధమున శివకుమారు లిర్వురు నోడిరి. వైష్ణవ జ్వరము శివజ్వరము నడంచెను. ఇచ్చట కృష్ణపారమ్యము బహువిధములఁ బ్రకటిత మగుచున్నది. కృష్ణుఁడు బాణుని గోవులఁదన దిక్కున నునిచిన వరుణు నోడించి యాతని దయఁ జూచుట యతని దిక్పాలకాతిశాయిత్వమును బ్రదర్శించుచున్నది. ఈ విధముగా నుత్తరహరివంశమునం దాద్యంతము కృష్ణపరబ్రహ్మత్వ నిరూపణము శ్రీ కవి స్వమాట్లులన్నట్లు ప్రబంధధ్వనియై యెసలారుచున్నది, ఈ ధ్వనియుఁ గథ

లన్నిటను సమానమైన కృష్ణనాయకత్వమును గావ్యమున కొక విధముగా వస్త్వైక్యమును సమకూర్చుచున్నది.

సోమనాథుఁ డుత్తరహరివంశపు గద్యలలోఁ దనకు "శ్రీ మత్సకల భాషాభూషణ, సాహిత్య రసపోషణ, సంవిధానచక్రవర్తి, సంపూర్ణ కీర్తి, నవీనగుణసనాథ" అను బిరుదములు చెప్పకొనెను, ఇవన్నియు నతనివిషయమున సార్థకములైనవే. ఇందు సంవిధాన చక్రవర్తి యనునది వస్తువునకు సంబంధించినది. సోమన కథల నన్నింటిని మూలమునుండియే గ్రహించినను వానిని మూలమునందు వలె నితిహాసమార్గమునఁగాక కావ్యమార్గమున లేక ప్రబంధమార్గమునఁ జెప్పియుండెను. అతఁ డచ్చటచ్చట నుచితములైన వర్ణనములుచేర్చి రసపాత్రపోషణమున కెక్కువ ప్రాధాన్యము నిచ్చుటలో నీమార్గభేదము కనిపించును. అన్ని కథలును అతఁడు వైశంపాయనునిచే జనమేజయునకుఁ జెప్పించెను. కృష్ణుఁడు మృతులైన విప్రపుత్రులను దెచ్చియిచ్చిన వృత్తాంతమును మాత్రము వైశంపాయనుఁడు తాను చెప్పినట్లు చెప్పక అర్జునుఁడు యుధిష్ఠిరునితోఁ జెప్పినట్లు చెప్పియుండెను. ఆకథ యందలి పాత్రలలో నర్జునుఁడు కూడ నొకఁడు. అతఁ డందు చెప్పినది స్వీయచరిత్రము. సోమన కథలు చెప్పిన విధానము హృద్యముగా నున్నది. బాణాసుర వృత్తాంతము నందలి యుత్తరభాగమున యుద్ధవర్ణన మద్భుతావహమయ్యు నతివిస్తృతమై కొంత విసువు కలిగించుచున్నది.

కథలయందలి సంవిధానసంఘటనము ప్రాయోభావముతోఁగూడి సహజమై యుండవలయును. సోమన ఆయాకథలయందు సహజములైన సంవిధానములు కూర్చుటలో మిక్కిలినైపుణ్యము ప్రదర్శించెను. ఊర్వశి దిట్టతనమును ప్రౌఢతయుఁ గల దేవవేశ్య. నరకాసురుఁడు కబురంపఁగనే వెళ్ళి యామె యతని కాముకప్రవృత్తిని కనిపెట్టెను. ఆమె కతనియందెట్టి యనురాగమును లేదు. మంచిమాటలతో నాతనిఁ గికురించి యామె తప్పించుకొని పోఁజూచెను. ఆమె చెప్పిన యుక్తు లన్నింటికి నాతఁడు సరియైన సమాధానములు చెప్పెను. అంత నామె "చిఱు తనగవుల తెప్పల సిగ్గుదేర్చి నీవు రాజవు మాటలు నిన్నుఁగడవనాడనేర్తునె" అని తనయోటమి నొప్పుకొన్నట్లు నటించి "మహామునుల్ క్రతువులు సేయుచోటి కధికారివి కాని కొఱంతయేటికిన్. యాజకులు యజ్ఞభాగ భాజిష్ణునిఁజేయ నిన్ను భావజ సౌఖ్యావ్యాజపదరాజుఁ జేసెద" నని పలికెను. ఆ మాట వినఁగనే నరకునికి "అవునిదివోలు" ననిపించెను. అతఁ డప్పటి కొదంబడి యామెను వీడ్కొలిపెను. ఇచ్చటి సంవిధానచమత్కార మెంత సహజముగా నున్నదో

అంత యద్భుతముగా నున్నది, విప్రుఁడు వచ్చి తనకుఁ బుట్టఁబోవు పుత్రుని కాపాడుమని వేడినప్పుడు కృష్ణుఁడే వెళ్ళుట కవకాశముండినచో నర్జునగర్వభంగమునకుఁ దావేయుండె డిదికాదు. అప్పుడు బ్రాహ్మణుని తుదిపుత్రుఁడొక్కఁడును బ్రతికియుండెడివాఁడేమో! కృష్ణుఁడు చేసిన అతిలోకచర్యలను వివరించుటకు వీలుచిక్కెడిదికాదు. అందుచే సోమన "యానాఁడు కృష్ణుఁ డొక శాస్త్రములో నొకక్రతు వొకనాఁటి దీక్షకొనరిన గని కృష్ణుఁ"డది గైకొనియుండెనని యతఁ డప్పుడు వెళ్ళకుండుటకు చక్కని సంవిధానము కల్పించెను. పౌండ్రక వాసుదేవుఁడు కృష్ణుఁడులేని తఱి నిశీథమున ద్వారకపై దండెత్తెను, నారదుఁడు పౌండ్రకుని యౌద్ధత్యమును బదరికాశ్రమమందున్న కృష్ణుని కెఱింగించెను. కృష్ణుఁడు మఱునాఁటి యుదయమునకు ద్వారక కరుదెంచెను. నారదుఁడు చెప్పియుండనిచో కృష్ణుఁ డింతత్వరగా వచ్చియుండెడివాఁడోకాదో! హంసడిభకులు దుర్వాసుని నవమానించిరి. అతఁడు సులభకోపి. వారిని శపించియుండవచ్చును. కాని "చక్రధరుఁడు బారి సమరనున్నాఁడు మిమ్మింకఁ గోపమేలనా" కని కోపమును నిగ్రహించుకొనెను. "యతినైన నాకేలయాగ్రహ"మని దుర్వాసుఁ డిట్లు శాంతము నవలంబించుట వింతగానుండును. కాని యదియే తరువాతి కథ నడచుట కవకాశమిచ్చినది. హంసడిభకులు విష్ణుభక్తుఁడైన జనార్దనునే జనార్దనుని కడకు రాయబారిగాఁ బంపుట యద్భుతమైన సన్నివేశము. ఇది వారిని జంపుటకుఁ దలంచుచున్న కృష్ణునకు మంచి యవకాశము కల్పించెను. చిత్రరేఖ యనిరుద్ధునిఁ గొనివచ్చుట కేగుచు దారిలో "నొకకమలాకరమున నకలుషయోగనిశ్చలత నచ్యుతుఁ జిత్తమున" ధ్యానించుచుండిన నారదునిఁగని యతనికా వృత్తాంతమంతయుఁ జెప్పెను. అనిరుద్ధుని కొఱకు కృష్ణాదులు వెదకుకొనుచుండ నారదుఁడు ద్వారకకేగి యీవిషయము నెఱింగించెను, వెంటనే కృష్ణుఁడు బాణాసురుపురముపై దండెత్తెను. ఈవిధముగా చిత్రరేఖ నారదుని కావిషయము చెప్పినట్లు వర్ణింపఁబడిన సన్నివేశము కథాగమనమునకుఁ జక్కఁగాఁ దోడ్పడినది. "తన మనుమనిఁ గొనిపోయిన మనమునఁ గోపించెనేని మధుసూదనుఁ డేమని శాపమిచ్చునో" యని చిత్రరేఖ భయపడెను. అందుచేతనే యామె నారదుని కావిషయము తెల్పనాతఁడు "ఇది నీకుంబని కాదు. నా చేసిన సంవిధానమున నీవు నిశ్చింతముగా ననిరుద్ధుఁ గొనిపొ"మ్మని యామెకు ధైర్యము గొల్పిపంపెను. ఈవిధము సోమనాథుఁడు సంఘటించిన సంవిధానము లాతనికిఁ గల సంవిధానచక్రవర్తియను బిరుదమును సార్థక మొనరించుచున్నవి.

సోమన యుత్తర హరివంశమున నాయా సందర్భములందు కావ్యోచితములైన పెక్కు వర్ణనలు చొప్పించెను. అందుఁ గొన్ని వ్యక్తులకు సంబంధించినవి; కొన్ని నగ

న్యాశమ పర్వత మృగయాదులకు సంబంధించినవి. ఆ వర్ణనము లన్నింటి నతని లోకజ్ఞతాభావనా పాటవములతోపా టొక చమత్కార సహితమైన నవ్యతయు గోచరించును. నరకుఁడు స్వర్గమును జయించి యమరావతీ నగరము నరయుటకై యందుఁ బ్రవేశించెను. "నృత్త గీతంబులు నిస్సాణపటహ సంజాతంబులును లేని చదుకములును" (1-52) అను సీసమును, దరువాతి వచనమును ఆ నగరమునకుఁ గలిగిన విన్నఁదనమును అందు బ్రవర్తిల్లిన యలజడిని గన్నులకుఁ గట్టినట్లు వర్ణించుచున్నవి. కావ్యాంతమున కృష్ణుఁడు బాణు గర్వమడంచి అనిరుద్ధుని చెఱ విడిపించి తిరిగి వచ్చినప్పటి ద్వారకాపుర నగరీ వర్ణనములున్నవి. అందానంద వైభవ వికాసములు తాండవించుచుండెను. (1-265, 266, 269) పై రెండింట అపజయమును విజయమును బొందిన నగరములందుఁ గనవచ్చు పరిస్థితుల తారతమ్యము చక్కఁగా గోచరించును. నరకుఁడు కబురంపఁగా నూర్వశి దిట్టయయ్యు మునుముట్టిన భయకారణమున తొడవు బూడ్చిన రూపుతో, విరులు పుచ్చిన, పెన్నెఱితో, పూతరాల్చిన మేనితో, కలికిచూపుల పీడ్కొన్న కన్నుగవతో చిరునవు నోసరించిన చిగురుమోవితో మది భీతి వెలుపలి కెఱుక సేయుచు నాతని సమీపించెను. (1-57) అలంకారరహితమయ్యు ననన్య సామాన్యమైన యామె రూపమునందలి సహజ సౌందర్య శోభావిశేష మీ పద్యమున నద్భుతముగా వర్ణింపఁబడినది. కొడుకు హతుఁడైన కారణమున భూదేవి "మాఁగువాటిన చంద్రమండలంబును బోలె వదనారవిందంబు వన్నె దఱుఁగ" (1-178) వగపు చిత్తరువో కళవళము కరువో యన నత్యంత విషణ్ణయై యుండెను. నరకుఁడు సత్యభామపై బాణములు విసరి నవి యామె మేనఁ గుసుమ శృంగారముకెల్లఁ గ్రొత్త సేసి యామె సొబగెనిమిది తెఱంగుల నినుమడింపఁ జేసెనని "క్రేఁగంటి చూపున గిరికొన్న, గేదంగి ఱేకుల కన్నదమ్ములగుచు" (1-151) అను సీసము హృద్యముగా వర్ణించుచున్నది. నరకుఁడు యజ్ఞసంభారముల నన్నింటిఁ బాడుచేసి కుమారికల బలాత్కరింప మునులు పలువిధములఁ గలత నొందిరి. "జడలు కంపలువట్టి జరుగ నీకున్నచో విడిపింప శిష్యుల వెదకువాఁడ" (1-102) అను పద్యమున నా కలఁత సూక్ష్మములతో వర్ణింపఁబడినది. మునులు కృష్ణుని కడ కరిగి నరకుఁడు తమ కొనరించిన యెగ్గు వివరింప

"అరుణాంభోరుహ పత్ర నేత్రుఁడు సముద్యద్భ్రూకుటీ భంగ భా
సుర ఫాలస్థలుఁడుం జలాచలమనశ్శూలాయమానవ్యథా
పరివేషానల భానుమండలుఁడునై ప్రత్యుగ్రరౌద్రం బనన్
నరకాలంఘ్య విజృంభణంబు నెఱపెన్నారాయణుం డాకృతిన్" 1-117

అని సోమన పుండరీకాక్షుఁడైన కృష్ణుఁ డరుణాంభోరుహపత్రనేత్రుఁడై రౌద్రమూర్తిఁ దాల్చిన విధము నద్భుతముగా వర్ణించెను. ఇందు నారాయణ పదము సాభిప్రాయము. నరకునిఁ జంపుటకై కృష్ణుఁడు నారాయణుఁడు కావలసిన యక్కఱ యిందు చక్కఁగా సూచింపబడినది. కృష్ణుని కడ కార్తుఁడై యరిగిన భూసురుని వర్ణించు

వెడపిడెడు దోవతియును, బెడతల చేతులు వడంకు పెదవులు తూఁగా
డెడు వెంద్రుకలును బైవైవెడలెడు కన్నీరుఁ గలుగు వేషముతోడన్ (2-7)

అను పద్యమాతని ఆర్తమూర్తిని సాక్షాత్కరింప జేయుచున్నది. ద్వితీయాశ్వాసము నందలి బదరికాశ్రమ వర్ణనమును (2-110), కైలాస వర్ణనమును (2-78), ప్రౌఢములై శ్లేష విరోధాభాసాలంకారములతోఁ గూడి బాణుని కాదంబరి యందలి వర్ణనములను దలపించుచున్నవి. కృష్ణుఁడు శివుని వర్ణించిన సీసము (2-174, 175, 176)ల పూర్వభావనా సమంచితములై యా దేవుని రూపమహిమానుభావములను లెస్సగా వివరించుచున్నవి. "లలిత విద్రుమలతా లావణ్యమగు జటాజూటంబు చిగురాకు జొంపమైన" (2-175) అను పద్యమున శివుని యందారోపింపఁబడిన పారిజాత తరుత్వము సర్వాంగ సంగతమై అత్యంత మనోహరముగా నున్నది. సోమన తృతీయాశ్వాసమున హంసడిభకుల వేఁటను చూచినట్లు వర్ణించెను. "ప్రబల దంష్ట్రాగ్ర పర్యస్త ముస్తాస్తం" భేత్యాది సీసము చదువునప్పుడు వరాహకులము ఘురఘురారావ మొనరించుచు పాఠకుల వైపునకు వచ్చుచున్న ట్లనిపించును. తృతీయాశ్వాసమున కృష్ణుఁడు ద్వారకకు వచ్చుటకు ముందు సోమన "కుంకుమ హత్తించి కొనగోరఁ దీర్చిన పురుహూతునిల్లాలి బొట్టనంగ" (3-86) నను పద్యమున సూర్యబింబమును గన్నుల పండువుగా వర్ణించెను. ఉత్ప్రేక్షామయమైన యీ పద్యము తరువాతి ప్రబంధకవులకు మార్గదర్శకమై ధారాశుద్ధి బంధురమై వీనులకుఁ గూడ విందు చేకూర్చుచున్నది. పంచమాశ్వాసము నందలి వన జలకేళీ వర్ణనమును, ఉషావియోగ వర్ణనమును సోమన భావనా పరిపక్వతను సూచించుచున్నవి. పంచమాశ్వాసములోని (5-136) వచనము నందలి కన్యాంతఃపుర వర్ణనము తరువాతి ప్రబంధకవుల విరహవర్ణన బీజములను నిలువయుంచిన నిక్షేపమువలె నున్నది. సోమన ద్వితీయ పంచమాశ్వాసములఁ దప్ప మిగిలిన నాలుగాశ్వాసములందు యుద్ధములను వర్ణించెను. ఈ వర్ణనము లందితనికి తిక్కన సోమయాజి యందుఁగల గురుభావము గోచరించును. యుద్ధ వర్ణనములం దితఁ డెవరెవ్వరితో యుద్ధము చేయుచుండిరో, యే యే శస్త్రాస్త్రములఁ బ్రయోగించిరో, వాని ఫలితమేమో విశదముగా వర్ణించును. ఆ సందర్భమున నితఁడు రచించు దీర్ఘ వచన

ములసంఖ్యాకములైన యసమాపకక్రియలతోఁ గూడి జరిగిన బీభత్సము నంతను కంటితల ముందు ప్రత్యక్షము చేయుచుండును. శివజ్వరము సోకినపుడు బలరాముఁడును (1-76, 77), కృష్ణుఁడును (1-96) పొందిన వికారములను, కృష్ణుఁడు జృంభణాస్త్రమును ప్రయోగించినప్పటి శివుని వికారములను (6-164) సోమన చాల సహజముగా వర్ణించెను. ఈ విధముగా సోమన వర్ణనము లొక్కొక్క యెడ నేకైక విన్యాస చిత్రణము తోడను, ఒక్కొక్క యెడ ప్రతిక్షణ చాంచల్యమాన దశావిపర్యయ చిత్రణము తోడను గూడి అతని భావనా పాండితీ లోకానుభవములను చక్కఁగా వ్యక్తము చేయుచుండును.

సోమనాథునికి సాహిత్యరసపోషణుఁడను బిరుద మున్నది. సాహిత్యరసమును సమాసమును ద్వంద్వముగా గ్రహించినచో నతఁడు సాహిత్యమును, రసమును పోషించినవాఁడను నర్థమువచ్చును. సాహిత్య శబ్దమును బలువురు "సాహిత్యం తుల్యకక్షత్వేన సహభావత్వమ్" అను నర్థమువచ్చునట్లు నిర్వచించిరి. "సహితం రస సంయుక్తం తదేవసాహిత్య"మ్మని మఱికొందఱు నిర్వచించిరి. రెండవ నిర్వచనము ప్రకారము సాహిత్యపదమున రసముకూడ నంతర్గతమైయున్నది. పై బిరుదమున సాహిత్య రస శబ్దములు రెండునుగలవు. అందుచే మొదటి నిర్వచనమునే గ్రహించుట యుక్తము. సోమన భారతకవులవలెఁగాక శబ్దార్థములు రెండింటికిని సమాన ప్రాధాన్యమొసంగెను. అతనిరచనలో ప్రతి సన్నివేశమున నర్థచమత్కారముతో పాటు శబ్దవైచిత్రియు గోచరించును. అందుచే నతఁడు సాహిత్య పోషణుఁ డనుట అన్వర్థము. ఇంక నతఁడు రసపోషణమున మేటి. అతఁ డుత్తర హరివంశమున శృంగార వీరరౌద్రకరుణ శాంతాద్భుత హాస్యబీభత్సములను చక్కఁగా పోషించెను. పంచమాశ్వాస మందలి యిందుధరోపాఖ్యానము శృంగారరసపోషకములైన వన జలకేళీ వర్ణనములతోఁగూడి హృద్యముగా నున్నది. అందలి స్త్రీల విలాసముల దర్శించినపుడే ఉషకు ప్రియసమాగమ వాంఛ యుదయించినది. ఉషాపరిణయ వృత్తాంతమున సోమన అయోగ వియోగ సంభోగ శృంగారముల నౌచిత్యవంతములుగా పోషించెను. ఊర్వశీ నరకాసురుల సంభాషణము రసాభాసము. ఊర్వశికి నరకునిపై ననురాగము లేశమైననులేదు. వారి సంభాషణము స్థూలదృష్టి కౌచిత్య దూరముగాఁ గనిపించును. కాని నరకుని కాముకతా రాక్షసత్వములను ఊర్వశి 'లంజతనమును' దృష్టి నిడుకొని చూచిన వారి సంభాషణ మట్లే సాగియుండునని తోఁచును. అయ్యును అందుకొన్ని అసభ్యతాబీజములు లేకపోలేదు. సత్యానరకాసుర యుద్ధవర్ణనమున సోమన శృంగారవీర రసములను మిళిత

మొనరించిన తెలుంగు ప్రశంసాపాత్రమై యున్నది. "అరిఁజూచున్ హరిఁజూచు" (1-162) అను పద్య మందుకుఁ దార్కాణము. సత్య యుద్ధకౌశలమును జూచి మెచ్చి కృష్ణుఁడు "లాలితకంఠాభరణంబుతో నతివకున్ లీలాపరిరంభము"ను కూడ నొసంగెను. ఆమెకు రెండు కంఠాభరణము లబ్బినట్లయ్యెను. తరువాత కృష్ణుఁడు "చెలువ చెక్కుల నెలకొన్న చెమట తుడుచుట" (1-170) మున్నగు పను లొనరించి యామె చేతి విల్లుగొని నరకునిపై బాణము వేయఁదొడంగెను. ఇచ్చటను శృంగారవీరముల మిశ్రణ మున్నది. అసలు సత్యా కృష్ణు లిరువురును గలసి యుద్ధమున కరుగుటయే శృంగార వీరములో కలిసి జంటగానేగి నట్లున్నది. నరకాసుర మరణానంతరము భూదేవిని వర్ణించుపట్లను, సుతమరణ విక్లబుఁడైన విప్రుఁడు కృష్ణుని దర్శించి తన ఆర్తిని వివరించుపట్లను కరుణము వెల్లువయై ప్రవహించుచున్నది. "తడియొత్తు చీరతో దాది కౌఁగిటఁజేర్చి చూపంగఁగన్నార జూడనైతి"(2-16) అను పద్యము కరుణ వాత్సల్యముల సంగమస్థానము. హంసుఁడు మరణించినవిమ్మట డిభకుఁడు యమునాజలముల "నా యెల్లినీడన నరలోకమేలుదు నను లావు వఱితి పాలయ్యెనన్న" (4-300) అను పద్యమా యన్నదమ్ము లంతకుముందొనరించిన యౌద్ధత్యమును మఱపింపఁజేసి పాఠకుల కన్నులకుఁ జెమ్మకలిగించును. చతుర్థాశ్వాసము చివర యశోదానందులు కృష్ణుని జూచుట కరుదెంచిన సందర్భమున వాత్సల్య భక్తి జాలువాఱుచున్నది. కృష్ణుఁడు తపస్సుచేయ శివుఁ డాతనికిఁ బ్రత్యక్షమైన సందర్భము శాంతమున కునికిపట్టు. ఘంటాకర్ణుని చేఁతలలోఁ దామసభక్తి చిహ్నము లున్నను అతఁ డాసనమునఁ గూర్చుండి లోపలను వెలుపలను ఏకైకమూర్తిని దర్శించిన సందర్భము శాంతరసాలవాలమై యున్నది. కృష్ణుఁ డాతని మేను నిమిరి అతనికి దివ్యరూపముతో పాటింద్రత్వమును గూడ నొసంగుట అద్భుతరసమయముగా నున్నది. జనార్దనుఁడు కృష్ణుని దర్శించిన ఘట్టము నిర్మలభక్తి ప్రవాహము. యుద్ధవర్ణనములును, అందు వీరాలాపములును వీరరౌద్రరసములకు నిధానములై యున్నవి. అందెడనెడ బీభత్సముకూడఁ దొంగి చూచుచున్నది. నరకాసురుఁ డొనరించిన యెగ్గులకు గుఱియై కలఁతనొందిన మునులను వర్ణించు తఱి నున్న సీసమునందలి "ముందఱ దిక్కు-డి మొల్రతాడుఁ దవిలిన తోఁకగోచుల తోడఁ దూలువారు" అనువాక్యము కన్నుల నీరు కార్పించుచునే యించుక నవ్వించును. పౌండ్రకుని ప్రగల్భములు కూడ హాస్యరసమున కుద్దీపనములైయున్నవి. హంసుఁడు క్రౌర్యమున దుర్వాసుని కౌపీనమును దొలఁగించుట హాస్యరసాభాసము. సోమన యుద్ధిక్తస్వభావుఁడు. ఏ రసమునైనను బొంగిపొరలునట్లు వర్ణించును కవిత్రయము వారి యందలి నిగ్రహ మీతనియందు మృగ్యము.

ఉత్తరహరివంశమున సోమనాథుఁడు పాత్రపోషణమున నెక్కువ కౌశలము ప్రదర్శించెను. ఇందలి నాయకుఁడు శ్రీకృష్ణుఁడు. అతని అతిలోకమైన పరాక్రమము, సర్వాస్త్ర వేదిత్వము భక్తరక్షణ పరాయణత్వము, దుష్టశిక్షణ శిష్టరక్షణదక్షత గురు పితృభక్తి మున్నగు గుణములతోపాటు పరబ్రహ్మత్వముకూడ నిందు చక్కఁగా వ్యక్తము చేయబడినది. సత్యభామ దరహాసామృత పూరమునువలె శరాసారమును గూడఁ గుమ్మరింపఁగల ప్రౌఢురాలు. ఊర్వశి నియయానుకూల. వచనరచనా పాటవముగల దిట్ట. ఉష అభిజాత్యాభిమానముతోపాటు నిర్మలమైన యనురాగమునకును నిలయమైన కన్యకామణి. చిత్రరేఖ చిత్రలేఖనమునందే కాక కార్యాచరణమునందును గుశలురాలు. భూదేవి పుత్రప్రేమకు నిధానము. బాణాసురుఁ డెంత భక్తుఁడో యంత యుద్ధతుఁడు. అతనికిఁగల కులగౌరవాభిమానము గొప్పది. కుంభాండుఁడు యుక్తాయుక్త విచక్షణుఁడు. నరకుఁ డెంత శూరుఁడోయంతకాముకుఁడు. శివుఁడు భక్తపరాధీనుఁడు. జనార్ద నుఁడు సాత్త్వికభక్తి సముద్రుఁడు. సాత్యకిబలరాములు శూరపుంగవులు. హంసడిభకులు గర్వితులయ్యు వేదాధ్యయనమునఁ బ్రీతిగలవారు. వారికొండొరుల యెడఁగల ప్రేమ యపూర్వమైనది. పౌండ్రకవాసుదేవుఁడు పరాక్రమసంపన్నుఁడయ్యు పరాత్మ భేదము నెఱుఁగఁజాలని గర్వి. సాధారణముగా సులభకోపియైన దుర్వాసుఁడిం దించుక శాంతస్వభావము కలవాఁడుగా గోచరించును. నారదునియందు సహజమైన కలహాశ నత్వమున్నను అతఁడు పౌండ్రకుని మందలించిన విధానమునుబట్టి శాంతిప్రియతయు కనిపించును. అనిరుద్ధుఁడెంత వీరుఁడో అంత ప్రేమ శీలుఁడు. ద్వితీయాశ్వాసమునందలి బ్రాహ్మణుని అపత్యప్రీతి అపూర్వమైనది, యశోదానందులు వాత్సల్య పరిపూర్ణులు. వరుణుఁడు చేసినబాస తప్పనివాఁడు. ఈ విధముగా సోమనాథుఁ డిందలి సర్వపాత్రలను సుస్పష్టరేఖలతోఁ దీర్చి దిద్దినాఁడు.

నవీన గుణసనాథుఁ డనునది సోమనాథునికిఁగల బిరుదములలో నొకటి క్రొత్త గుణములు కలవాఁడని దీని యర్థము. అంతకుఁ బూర్వముండిన కవుల కవిత్వముతోఁ బోల్చిచూచిన నతని కవిత్వమందలి నవీనత వ్యక్తమగును. కవిత్రయము వారు భారతానువాదమునఁ గొంత స్వాతంత్ర్యము ప్రకటించినను ప్రధానకథా సూత్రము నెచ్చటను విచ్ఛిన్నముచేసి యుండలేదు. సోమన యట్లుగాక మూలమునందలి కథ నంతను గ్రహింపక తన కిచ్చవచ్చిన కొన్నియుపాఖ్యానములనే గ్రహించి వానిని గూడ నతి స్వతంత్రముగా రచించెను. ఇది అనువాదము నందలి నవీనత. హరి వంశము భారతపరాంశమగుటచే దానివలె నదియు నితిహాసమే. సోమనాథుఁడు. తన

రచనను ప్రబంధ ధోరణిలో సాగించి పూర్వమున్న యితిహాస వాహినికిఁ బ్రబంధపు మలుపు కలిగించెను. భారతమున నర్థశబ్దాలంకారము లెడనెడ గోచరించినను అవి యందు యాదృచ్ఛికములే. సోమన కర్థశబ్దాలంకారములందు ప్రీతి హెచ్చు. అతఁడు వానికై చేసిన ప్రయత్నము స్పష్టముగా గోచరించును. ఇతఁడు కొన్ని అచ్చతెలుఁగు పద్యములను నిరోష్ఠ్యములను గూడ రచించెను. ఇదిరచనావిధానమునందలి నవీనత భారత కవులు శబ్దాడంబరమునకుఁగాని పాండితీప్రదర్శనమునకుఁగాని ప్రయత్నించి యుండలేదు. సోమనలో నా రెండును గనిపించును. ఇతని రచన యోజో భరితమై యుండును. ఇతని పద్యములు పదప్రయోగ చమత్కారమున కునికిపట్టులు. ఇది పదప్రయోగ నవీనత. రసపోషణ విషయమున భారతకవులు నిగ్రహము ప్రదర్శింతురు. సోమనయందది తక్కువ. శృంగార రసపోషణమున నితఁ డించుక మితిమీఱి నట్లు తోఁచును. ఇది రసపోషణమునకు సంబంధించిన నవీనత. ఇట్లే కావ్యారంభము నందును, కథాకథనమునందును పద్యముల యెత్తుగడలందును ఇతఁడు కొంత క్రొత్త దనమును ప్రదర్శించెను. ఇతనికి ముందు రచింపఁబడిన గ్రంథములను జదివి యితని గ్రంథమును చదువునప్పుడు పఠితకొక క్రొత్తమార్గమునఁ జొచ్చినట్లు తోఁచును అదియే యితని నవీనగుణసనాథతకు మూలము.

సోమనకు సకల భాషాభూషణుఁడను బిరుదమున్నది. సంస్కృతాంధ్రముల తో పాటితనికి ప్రాకృతభేదములతోడను తమిళ కన్నడములతోడను పరిచయ ముండ వచ్చును. చిన్నయసూరి యితనిని సర్వజ్ఞుఁడని శ్లాఘించెను. ఆ సర్వజ్ఞత కిందు కొన్ని నిదర్శనములు కనిపించును. ద్వితీయాశ్వాసమున కృష్ణుఁడర్జునునకు ప్రణవతత్త్వము పదేశించెను. అందే కృష్ణుఁడు శివుని శివుఁడు కృష్ణుని నుతించి యుండిరి. దుర్వాసుఁ డును, అన్యమునులును, వరుణుఁడును ఆయాసందర్భములందు కృష్ణుని స్తుతించి యుండిరి. వీని యన్నిటియందు సోమనకుఁగల తత్త్వయోగ శాస్త్ర ప్రావీణ్యము గోచరించును. అతడు హరిహరాభేదమును నిరూపించిన తీరతని మనః పరిపక్వతకు తార్కాణము. కృష్ణుఁడు నరకుని చతుర్దశినాఁడు వధించెను. నరకుఁడు త్వష్టకు నుదాహరకు నాత్మజయైన చతుర్దశిని భార్యగా గ్రహించెను. ఈ రెంటికి నేదో సంబంధ ముండవలెననియు, ప్రళయసముద్రము నుండి ధాత్రి సముద్ధరింపఁబడునపుడు భూమినుండి యొక పెద్ద మట్టిపెళ్ళ యొక యల్ప గ్రహ పరిమాణముకలది విడిపోయి యంతరిక్ష ప్రమాణము దాఁటిపోయి యుండుననియు, నరకుఁ డట్టి గోళమై యుండు ననియు, దాని నండపిండ బ్రహ్మాండమున కధినేతయైన కృష్ణుఁడు చిద్రుపలుగాఁ జేసె

ననియు, ప్రాగ్జ్యోతిషమున కరుగుట యనఁగా నాకాశయానమున నంతరిక్షములోనికిఁ బోవుటయనియు శ్రీ కవిసమ్రాట్టులు వ్రాసియున్నారు. ఇది సోమన ఖగోళశాస్త్ర విజ్ఞానమునకు నిదర్శనము. ప్రథమాశ్వాసమున మునులు కృష్ణుని కడ కేగి తాము తీసికొని వెళ్ళిన విధ్వంసోపకరణములను జూపి "ఇది నాయుద్ధమనీయ వస్త్ర" మను పద్యమున (1-112) వానిని నేఱువేఱ యెఱింగించిరి. వీనినిబట్టి సోమనకుఁగల శౌత పరిజ్ఞానము నెఱుంగవచ్చును. వ్యాకరణ సాహిత్యశాస్త్రములం దతనికిఁగల పాండిత్యము గ్రంథమున సర్వతోముఖముగా గోచరించును. ద్వితీయాశ్వాసమునందలి "కోటసింగా రించి కొత్తళంబుల నెల్లఁ బట్టుఖ్ఖువన్నించి" (2-92) అను పద్యమునను, తృతీయా శ్వాసము నందలి "వంకదారకుఁ జేరి వాకిటి దద్దడంబులుసేర్చి" [3-24] అను పద్యమునను, పెక్కు యుద్ధవర్ణనము లందును అతనికిఁగల సంగ్రామ కళాశస్త్రాస్త్ర పరిజ్ఞానము వ్యక్త మగుచున్నది. తృతీయాశ్వాసమున కృష్ణుఁడు రుక్మిణీ సత్యభామ లతో జూదమాడిన ఘట్టమున్నది. అందు సోమన ద్యూతమునకు సంబంధించిన పారి భాషిక పదములెన్నో వాడియుండెను. [3-120; 122; 124; 128] ఇవి యన్నియు నాఁత డెట్లెఱింగెనో! ఈ విధముగా నుత్తరహరివంశము సోమనాథునికిఁగల సర్వజ్ఞ త్వమును చెప్పకచెప్పుచున్నది. అతఁడు కవిత్వమునందేకాక పెక్కు లౌకికవిద్యల యందును నిష్ణాతుఁడై యుండుటచే నారోజులలో గొప్ప కీర్తి సంపాదించియుండును. అందుచేతనే అతఁడు సంపూర్ణకీర్తినని విశ్వాసముతోఁ జెప్పుకొనగల్గెను.

సోమనాథుఁ డుత్తరహరివంశమును తిక్కనవలె హరిహరనాథుని కంకితము చేసెను. అతఁడు ద్వితీయాశ్వాసమున హరిహరాభేదమును చక్కగా నిరూపించెను. శివుఁడు కృష్ణునకు సాక్షాత్కరించి అతని కేలుకేలఁ గదియించి మన్నించిన సందర్భ మున నతఁడు వ్రాసిన

ఇత్తెఱఁగున నయ్యిరువుర
చిత్తము గతి నొడలు గలసి సిద్ధాంత పరా
యత్తులగు మునుల యెఱుకకు
విత్తై చెలువారె జమిలివేల్పై తెలుపన్. (2-178)

అను పద్యము వారి అద్వైతభావమునకు నిదర్శనము, తరువాత మునులును సుర లును వారిని నుతించిన తెఱంగు "ఎల్లలోకంబులకు దైవ మేకమగుట హరిహరాత్మక" మను విషయము స్పష్టము చేయుచున్నది, శివుఁడు కృష్ణునకుఁ బుత్రుఁ డుదయించునని తెల్పి "తపస్సిద్ధికిందగు మేలిచ్చుట కాదు పూర్వవిహితార్థంబింత కింతేటికిన్" అని యతని కొనియాడఁ దొడంగెను. ఆ స్తుతిలో హరిహరాభేదమే కాక త్రిమూర్తుల యేకత్వము కూడ నిరూపింపఁబడినది. శివుఁడు పిమ్మట సకలదేవతా మునిసంఘ

ములను గనుఁగొని "ఏ మిరువురు నేకంబిది సామర్థ్యజురాది తత్త్వసార" మని వాచ్యముగాఁ దెల్పియుండెను. ద్వితీయాశ్వాసమందు జనమేజయుఁడు వైశంపాయనుని గృష్ణుని కైలాసయాత్రా వృత్తాంతము చెప్పుమని యడుగు సందర్భమునఁ గల "పరివాదాస్పదవాదమోద మదిరాపానంబుచే మత్తులై" (2-68), "పదునాలుగు లోకంబులుఁ బొదవింపం ద్రుంపవలసి పొడవుల రెండై"(2-69)అను పద్యము లీవిషయమును మఱింత విశదము కావించుచున్నది. బాణాసురవృత్తాంతమున శివుఁడు కృష్ణునకును శివజ్వరము వైష్ణవ జ్వరమునకును ఓడిన యుదంతము కలదు. ఇది కృష్ణుని యాధిక్యమును సూచించునట్లు కనిపించును. కాని చక్రము బాణాసుర శిరశ్ఛేదమున కాజ్ఞ యిమ్మని కోరినపుడు కృష్ణుఁ డందు కంగీకరింప నుండ శివుఁ డతని చెట్టవట్టికొని బాణుని గావుమని వేఁడెను. అంతఁ గృష్ణుఁడు "ప్రమథాధిపః బాణసురారి నీవు గాచిన క్రియ నేను గాచితిని సిద్ధము నా వచనం"బని పల్కెను. ఇచ్చట మరల వారిరువురి యేకత్వము వ్యంజిత మగుచున్నది. అట్లే కృష్ణుఁడు శివుని గూర్చి తపస్సు చేయ బోవుట శివాధిక్యమును సూచించునట్లుండును. కాని శివుఁడు కావించిన స్తోత్రమున వారి యైక్యము సుస్పష్ట మగును. వైశంపాయనునితో జనమేజయుఁ డన్నట్టది ఆ యిరువుర "నాటకమే" కాని నిజమునకు వారిరువురు నేకత్వశోభితులే.

సోమనాథుఁడు హరివంశమునఁ బెక్కు సంభాషణములను నాటకము నందు వలె రమ్యముగా నడపించెను. ఊర్వశీ నరకాసురులకును, ఆర్తుఁడైన విప్రునకును కృష్ణునకును, నారద పౌండ్రులకును, జనార్దన హంసడిభకులకును, వరుణ శ్రీ కృష్ణులకును, శివ కేశవులకును జరిగిన సంభాషణము లిందుకు నిదర్శనము. చతుర్థాశ్వాసమున మునులు తమ తెచ్చిన భగ్నవస్తు సముదయభారము లిచ్చి కృష్ణునికిఁ జూపి "ఈ కమండలు పంక్తి నెటుచూతు నిట్ల తత్పాపమస్తంబులు వగులకున్న" (4-102) అని చెప్పిన పద్య మా దృశ్యమును గన్నులకుఁ గట్టుచు "ఈ వెండ్రుకలు పట్టి యీడ్చిన యా చేయి" అని తిక్కన ద్రౌపదిచేఁ జెప్పించిన పద్యమును దలంపునకుఁ దెచ్చుచున్నది, ఇట్లే చిత్రరేఖ తాను వ్రాసి తెచ్చిన చిత్రపటము లుషకుఁ జూపి "సుదతి నీ మదిలోని సౌరదోఁకి మదనుండు తన కొండు చోటింకఁ దడవుఁ గాక" (5-141), అన్న పద్యము కీచకుఁడు ద్రౌపదితో "సుదతిః నీమై చక్కఁ జూడంగ వెఱచెదఁ గనుఁబాటు వొరయునో యని తలంచి" యను తిక్కన పద్యమును స్మృతికి దార్చుచున్నది. ఇట్లే నాటకోచితములని చెప్పఁదగిన సన్నివేశములు పెక్కు సోమన ఉత్తరహరివంశమున సృజించి యుండెను.

ఉత్తరహరివంశమున భావగంభీరములైన పద్యము లనేకము లున్నవి. వానిలో రెండు మూఁడు మాత్రి మిచ్చట నుదాహరింతును. ఘంటాకర్ణుఁడు తపస్సానరించుటకు వచ్చిన కృష్ణుని చూచి

చేతోజాతుఁడు నీవు నేమగుదురో శీతాంశుచూడామణిం
భీతుం జేయఁ దపంబు చేసెదొ విచారింపంగ నన్నేలగున్
బాతాళంబును నేలయుం ద్రిదివముం బాలించు సిద్ధుండవో
నా తండ్రీ నను నేల వచ్చిన జగన్నాథుండవో చెప్పవే (2-133)

అని యడిగెను. కృష్ణుఁడు జగన్మోహనాకారుఁడు. అందుచే మన్మథునికి నతనికి నేదో సన్నిహిత బాంధవ్య ముండవలెనని ఘంటాకర్ణునికిఁ దోఁచినది. అతఁడు తపము చేయ వలసిన యక్కఱ యాతనికిఁ గనఁబడలేదు. అతఁ డతిలోక పురుషుఁడని యతఁడు గ్రహించెను.

అసలఁ ద్రంపివెట్టి హృదయం బను కాఁగున యోగవాసనా
భ్యాసపు నీరు గాఁచుటకు నాగమపావకముం దఁగిల్చి యా
యాస విహార మత్కుఱ గణైహిక శయ్యకుఁ దజ్జలంబు పై
బోసిన దేశరీర మది పొందియుఁ బొందనియట్లు యాఱడున్ (4-86)

రూపకాలంకార శోభితమైన యీ పద్యమున మానవుఁడు లోకమున నుండియు నంటియు నంటకుండ జీవన్ముక్తుఁడై యుండు విధము సూచింపఁబడినది.

అవిరళ రత్న నూత్న కనకాసన పూర్వమహీధరంబుపై
నవ వికచారవింద రుచి నవ్వెడు కన్నుల దాయ చుక్కలన్
దివియల మాయఁ జేయ నలు దిక్కుల మ్రొక్కుల పేర మోడ్పు యా
దవకరకైరవంబుల కతంబునఁ గంటి మురారి భాస్కరున్ (4-180)

ఇందును రూపకాలంకారమే కలదు. సోమన కృష్ణుని యందు భాస్కరత్వ మారోపించి యాతని రూప సౌష్ఠవమును జక్కగా వర్ణించి యున్నాడు.

శూలి విలోకనానలము సోఁకు రతీశుఁ డెఱుంగుఁ గాన య
బ్బాల మనంబులో విరహపావకదాహము నోర్చెనన్న న
ల్లేల పొసంగు దేహము దహించిన యంతటితో మనోజ్ఞుఁడై
గాలియ చిక్కెఁగాన చెడఁగాలఁడువో యెటువంటిమంటలన్ (5-123)

ఈ పద్యమున నుష విరహతాపతీవ్రత చమత్కారసహితముగా వర్ణింపఁబడినది. మునులు, శివుఁడు, కృష్ణుఁడు, జనార్దనుఁడు మున్నగు వారిచే స్తుతిరూపమునఁ బలి కింపఁ బడిన సీసములు పద ప్రయోగమునందును, ధారాశుద్ధియందును భావగాంభీర్యము నందును సాటిలేనివై సోమన కవితా కౌశలమును లెస్సగాఁ బ్రకటించుచున్నవి.

సోమన అలంకార ప్రియుఁడని యిదివఱకే చెప్పఁబడినది. అతఁడు పెక్కు చోట్ల రూపకోపమోత్ప్రేక్షాలంకారములను గొన్నిచోట్ల నతిశయోక్తి వక్రోక్తి శ్లేషా

ర్థాంతరన్యాసములను వాడియున్నాఁడు "మాఁగువాఱిన చంద్రమండలంబును బోలె వదనారవిందంబు వన్నెదఱుఁగ" (1-178) అను పద్యమునందలి యుపమోత్ప్రేక్షలు భూదేవి దుఃఖముతోఁ గూడిన ఆర్తమూర్తిని చక్కగా వ్యక్తముచేయుచున్నవి. చిత్రరేఖ యనిరుద్ధుని జూచినప్పుడతఁడెట్లుండెనో, "లలిత నూతనలతాలంకారముల మెచ్చి మొగమిచ్చు లేమావిమోకవోలె "5-188 అను పద్యమున వివరింపఁబడినది. ఇందలి యుపమానము లచ్చటలేని నాయికరూప సౌష్ఠవమును గూడ వ్యంగ్యముగాఁ బ్రకటించుచున్నవి. ఉషానిరుద్ధులు కారాగృహనిబద్ధులైనప్పుడు చెలికత్తె లేడ్చిరని చెప్పు సీసమునందలి (5-276) యుపమానములు నిరుపమానములు. ఇట్టి చక్కని యుపమాలంకారములు గ్రంథమునం దంతట నున్నవి. అట్లే సుందరములైన యుత్ప్రేక్షలును లెక్కకు మిక్కిలిగా నున్నవి. "హంస డిభకుల సేనయేఁడనఁగ నడచె" (4-228) అనుపద్యమునందలి యుత్ప్రేక్షయు, "మనసు ముచ్చిలి చొచ్చిన మత్తికాఁడు వీఁడు గొమ్మని చేసాచె వెలఁదియపుడు, కాముఁడటమీద ననిరుద్ధు గాత్రమునకుఁ జిగురుఁ బట్టెంబు చేర్చుట చెప్పినట్లు" (4-149) అని ఉష తనమనస్సు దొంగిలిన యువకుఁడనిరుద్ధుఁడే యని చూపుటను వర్ణించు పద్యమునందలి యుత్ప్రేక్షయు రమణీయములుగా నున్నవి, "నవ్వులమాటలో నిజమొ" (4-74); "యాజకులు యజ్ఞభాగ" (4-78) మున్నగు పద్యమునందలి అర్థాంతరన్యాసములు సహజసుందరములై సోమనాథుని లోకజ్ఞతను జాటుచున్నవి. "చిల్కవోయినంబంజరమేమి సేయు" (1-72) అనుటయందలి సమాసోక్తి యద్భుతముగా నున్నది. బదరికాశ్రమ కైలాస వర్ణన వచనములందలి విశ్లేష విరోధాభాసములు సోమన పాండిత్య వైభవమునకుఁ దార్కాణములు.

పాతాళాధిపుఁడైన శేషుఁడు ప్రలంబఘ్నుండు నారాయణ
ప్రీతిం బుట్టిన శంకరుండని జనుల్ పేర్కొన్నచో నంధకో
ద్భూత స్నేహముఁ గామపాలతయుఁ దప్పుందప్పుఁ గాకేమి ప్ర
ఖ్యాతిం బొందఁడె పాండురాంగమహిమన్ హాలాహలా స్వీకృతిన్ (1-7)

అనుపద్యము శ్లేషాలంకారముతోడను భావగాంభీర్యముతోడను గూడి యింపునింపుచున్నది. అర్థాలంకారములవలె శబ్దాలంకారములను గూడ సోమన విచ్చలవిడిగా వాడియుండెను. అతని వచనము లనుప్రాసాలంకార భాసురములు.

దివిజుల్ దల్లడిలం దదీయ జనయిత్రీకుండల ద్వంద్వమున్
జెవులం బెట్టికొనంగ రూపగుట సూచెంగాని యాతప్పు నీ
జెవులం బెట్టికొనంగరాని పురిగాసిం బెట్టి కట్టిండివా
సవుఁ డెట్టుం దనుఁ జంపఁజాలు టితఁ డిచ్చం జూడఁ డింద్రానుజా (1-184)

"అరిఁగరమున నేఁదాల్చిన నరిగరము నగేంద్రధీరుఁడయినం జెడఁడే యరిఁదిరమై
నన్నడుగుట యరిదిరమైకాభిలాషులగు నృపతులకున్ 4-162

"అస్మదీయ మహిమ మహిమడుంగమడంగగు మనసు మాయ
మాయ గన్నులఁ గ్రమ్మఱితి నేను" (2-34 ముక్తపదగ్రస్తము).
నీ హారము పేర సఖీవ్యాహారము విన్న నలుగువారుఁదనువుగా
నే హారమఖతఁబెట్టిన నా హారముఁ దొరుగుఁదొరుగు నాహారంబున్ (5-127)

అను పద్యములందు యమకాలంకారము లున్నవి. చివరికందమున త్రిప్రాసముకూడ నున్నది. మొదటిపద్యమునందలి ఇంద్రానుజా అనుసంబోధనము సాభిప్రాయము. కొన్ని వర్ణనపద్యములలో సోమన అంత్యానుప్రాసము వాడెను. (2-88) శబ్దాలంకార ప్రీతియున్నను అతఁడు రసభావముల కెచ్చటను భంగము కలుగనిచ్చి యుండ లేదు.

శ్రీనాథుఁ డెఱ్ఱన కవిత్వమునందలి సూక్తివైచిత్రిని ప్రశంసించి యుండెను. ఆ సూక్తివైచిత్రి సోమన కవిత్వమున మఱింతయధికముగాఁ గానవచ్చును. చతుర్థాశ్వాస మందలి ౭16వ పద్యమునందలి "సర్వం సహాకాంత పేరణము సూప, ఆకాశలక్ష్మి కోలాటమాడ, వరుణుండు గొండిలి పరిఢవింప, కమలసంభవుఁడు ప్రేంఖణ మొనర్ప" అను వాక్యము లిందుకు నిదర్శనములు. "చక్రంబు మేదినీ చక్రంబు నేదేవు దక్షిణబాహు సౌందర్యమొసఁగు" (4-816) అను పద్యమునందలి పాదములన్నింట శాబ్దికమైన వైచిత్రి కానివించును. "నా దెసఁ గామునమ్ములకు నాటుట వైళమసిగ్గుఁ జిత్తమున్ వాదులు పెట్టుకొన్నయవి" యనువాక్యమునందు సిగ్గును జిత్తమును వాదులుపెట్టుకొనెననుట లజ్జాధిక్యమును సూచించుచున్నది. పంచమాశ్వాస మం దొకకాంత శివునివేషము నను కరించి హరుచూపులకు హరుఁడయ్యెనను పద్యమును (71) "సుదతి నీ మదిలోని సొరదోఁకి మదనుండు తన కొండు చోటింకఁ దడవుఁగాక" (141) అను పద్యమును అర్థ చమత్కారముతోఁ గూడి పఠితల నానందసముద్రమున నోలలాడించును.

సోమనాథుని శైలి పెక్కుచోట్ల సమాసభూయిష్ఠమై ఓజోగుణభరితముగా నుండును. అయ్యును అతఁడెడనెడ లలితములైన తెలుఁగు పలుకులు కూర్చి తన రచన కనన్యసాధారణమైన సౌందర్యము నాపాదించుచుండును. "తడియొత్తు చీరతో దాది కౌఁగిటఁ జేర్చి చూపింపఁ గన్నారఁ జూడనైతి" (2-16) అనుపద్యమిం కొక దృష్టాంతము. అతఁడెన్నో లోకోక్తులను, సామెతలను, పదబంధములను, జాతీయములను సందర్భానుగుణముగా వాడి తనరచన కపూర్వమైన వన్నె చేకూర్చియుండెను. తలపువ్వువాడదు, కారుచిచ్చునకు గాడ్పులు తోడగుచందము, చీరపుఁబొత్తము కట్టుకొనిపోయె, ఇట్టిక సూఁడినవాఁడు. లజ్జబండతనము, పైకొం గనువు పరుచు, గండారవుబొమ్మ, పొత్తులదానవు, పువ్వులు వేడుకై నఁగడి వోయినవేన్ (వాళ్) ముడుసంగ వచ్చునే, ఎంతదఱిఁగిన మిరియాలుం జొన్నల సరిపోవే, కనికని కొత్తివ్వఁడింటి కంబముచేసెన్, శిరసుండఁగ మోఁకాలను నేసలువెట్టుట, దిశాపట్టము, చీమ చిట్టు

కన్నను, పిడుగు చిట్లినఖంగిన్, నోచినవారి సొమ్ములవి నోమనివారికి వచ్చునే ధరన్, గతజలసేతుబంధనము, లేఱరమకాదె బిడ్డలులేని బ్రతుకు, అప్పులప్పలనంగ, మాడినవేమి సేసెదవు మంత్రపునీళులు సల్లవచ్చునే, మదనకామధేనువు. తగునే కఱకుట్లును జంకఁబొత్తముల్, జమిలివేల్పు, మంట లోమిడుత బీరమునూపుట, చత్రాతిపై పోఁకలై, కుమ్మరావమున రాగిముంత లేఱంగఁ గలవె, జీలుగువెరిఁగిన మాలెకుఁ గంబంబుగాదు, పూచిన మోదువులతోడఁ బుట్టువులు, ఒడిదప్పినపాముపోలె, ఒడిసెల జొన్నలకాడెడి విధమున, కీర్తిపటములు సిరుగకుండ. పెన్నిధిగని పొంగుచున్న పేదలక్రియ, నీరముంచిన సొరకాయ నెగసినట్లు, పఱిగల నేఱినంగోలుచు పాఁతటికిం గలదే, తాఁజెడ్డవాఁడు వెనకయ్య చేతికి వెసలిచ్చెననుమాట, వరుగుతో దాఁగరయు నెండవలసినట్లు, తెలుఁగుమాలి తవుడు తిని చచ్చువానికి విషము వెట్టువాఁడు వెఱ్ఱివాఁడు, నక్కఁ బగ్గానంబట్టినయట్లు బిఱ్ఱబిగియంగా, దాగంబోయి తలారి వాని యెదురం దాఁగంగ నీకేటికిన్, మొదలు చూచి చెట్టెరుఁగువారి కాకులు సిదుమనేలఁ, ముంజేతి కంకణమున కద్దమేటికి, పులిపేదవడినఁ బసులవాండ్రె యెక్కుడిరనుకతవచ్చె నాకు, కొఱవిం దల బరికికొన్న కొఱడులు, ధర యింగలాలపుట్ట, మద్దులు మునింగిపాఱ వెంపళ్ళు తమ కెంతబంటి యనుట. ఒదవె నాహాతీర్థమున్, కమలజుని పేరదాపటికాలి బొమ్మ, ఇనిఱింతలువారు, సారసత్త్వమొనల్ వాడిసేసి, పిడుగువ్రేసిన తలటోప్పి యాగునే, చెఱువువిడిచి కాలువఁ బొగడం జనునే, కఱవఁగ వచ్చునే బలిమి గాడిదకుం బులితోలు కప్పినన్, జముని బానసముం బురుడించుచోటు, మిన్నుల మీఁదఁ బారు, వులిఁగోల వ్రేసినట్టు, పాపటపై నడిదంబు వెట్టు, ముగుర పొత్తు పళ్ళెరంబు, వెలుగు చేన్మేసినఁ గాచువారనెందుఁ గలరె జగతి, అలజాలంబు నీరిలోనాడు జాడ, లజ్జకు లజ్జలేదు, సిగ్గుఁజిత్తమున్ వాదులు పెట్టుకొన్నయవి, అలిగి తన్నినఁ బఱుపుపయిం బడినయట్లు, నడుమఁబెట్టినఁ బూరికాలు, ఎదిరికిన్మడఁచువాఁడు దనకుఁ దగరంబు చఱచు దెంతటి ఖరమ్ము, బొందులు మునింగిగుండులు తేలెన్, కన్నుండఁ గంటిపాపం గొన్నట్లు, కలనఁ బదారు మొగంబుల మలయుదువు, చెఱకుం జెఱకైన వంటచెఱకుంజెఱకే! నేల తలఁగాళ్ళు నిలువమి, నీ పొంగిన పుడినెఁడు పోయెను మున్నగున విందుకు దృష్టాంతములు. సోమన రచనలో శబ్దరత్నాకరమునఁ గాని యితర నిఘంటువునఁగాని యెక్కని ప్రయోగములు పెక్కుగలవు

సోమన సాభిప్రాయములును వ్యంగ్యార్థ ద్యోతకములునైన శబ్దములు పలుచోట్ల వాడియుండెను. డిభకుఁడు యమునాజలముల మునిఁగిన హంసునిగానక విలపించు సందర్భమునందలి సీసములోని పఱితిపాలయ్యె, నీటఁగలసె, వెల్లిఁబోయె, ఏఱు గొనియే అను ప్రయోగము లొకవంక నాశనమై పోయెను, వేరొకవంక యమునలో గలసెను అను నర్థము లిచ్చుచు సాభిప్రాయములై యున్నవి. ఉష హర్మ్యాగ్ర భాగమున నేకాంత నిద్రారతినున్న సమయమునఁ గలలోఁ గుమారుఁడొకఁడేమో చేసె"

ననుట మిక్కిలి యౌచిత్యశోభితమైయున్నది. బ్రాహ్మణుఁ డర్జునుని మారుసమయమున "ఓ పార్థ నిన్ను నమ్మితి బాపని రక్షింప కి ట్లపార్థుఁడవైతే" యను సందర్భమునందలి పార్థాపార్థ శబ్దముల ప్రయోగము రమ్యముగా నున్నది. "వెలిదమ్మిలో లేఁత వెన్నెలో యమృతమో కన్నులో చిరునవ్వో కనికరంబొ" (4-188) అను పద్యమునందలి పదముల క్రమ విన్యాసము ప్రశంసనీయముగా నున్నది. "ఉత్తముండు హితముచేసి యూరకుండు, మధ్యముండు హితముచేసి మారువెదకు, నధముఁ డొరుచేయు హితమైన నణఁచిపుచ్చు, హితమునకు నెగ్గుసేయువాఁ డెవ్వఁడగును" (5-300) అను పద్యము భర్తృహరి నీతిని స్ఫురణకుఁ దెచ్చుచున్నది "యదుకులాంబుధిచంద్రు నానందమునఁ జూచు రామాది హితచకోరములలోన" (4-187) అను పద్యమున కృష్ణుఁడు చంద్రపారిజాత సరోవర పుష్పగుచ్ఛమాల తోడను, రామాదులు చకోరములతోడను, రాజన్యులు రాజకీరముల తోడను, సనకాది దివ్యహంసముల తోడను, పరిచారికలు ద్విరేఫములతోడను బోల్పఁబడియున్నారు. సనకాదులను దివ్యహంసలనుటయు పరిచారికలను ద్విరేఫములనుటయు సాభిప్రాయమై యున్నది, వారు నిజముగా పరమహంసలు. పరిచారికాశబ్దమున రెండు రేఫము లున్నవి "ఏలిన నాగారులచేత" (4-188) అనుచో నాగారు లను బహువచనప్రయోగము హేళనాత్మకము. కృష్ణుఁ డుద్ధవుని "తండ్రులుమీరు" (2-101) అనుటలో నెంతో గౌరవమున్నది. ఈ విధముగా నాతఁడు శబ్దప్రయోగమునఁ జూపిన నేర్పు శ్లాఘాపాత్రమైయున్నది.

సోమన వ్రాసిన కొన్ని పద్యములు శబ్దచిత్రముతోడను సమాసజటిలత్వముతోడను గూడి దుర్రవగాహములుగా నున్నవి. "కుజముకుంజరముచేఁ గూలునో కూలదో కూలు కుంజరము నీకుజము గూల్చె "(2-176)" ధారాస్ఫార కృపాణబాణపటలీ ధారాహతిన్" (6-52) మున్నగుపద్యము లిందుకుఁ దార్కాణములు. సోమన ఛందోవైవిధ్యమునకై ప్రయత్నించి యుండలేదు. అతఁడొక స్రగ్ధరను, రెండుమహాస్రగ్ధరలను, మూఁడు తోదకవృత్తములను వాడి యుండెను. "అమరారి చెవులముందఱఁ గొమరారి వెలుంగు నమృతకుండలముల" (1-80) మున్నగు రెండుమూఁడు కందములలో త్రిప్రాసము కలదు. "ఎ్రదిచినకాలపాకమున" (4-110) అను పద్యమున ఎ్రదిచిన, అ్రదిచిన, వి్రదుపఁగ, చి్రదుపలు అను పదములు నాల్గింటను రేపసంయుక్తాక్షరములకుఁ బూర్వమునందున్న వర్ణములు లఘువులే. "చనిచనికాంచెనంత" (1-106) అను పద్యము నిరోష్ఠ్యము. "కఱచిన పీనుఁగు న్వెడఁద కప్పెరయున్" (2-126) "తొలుకారు మెఱుఁగులతోఁటలో నాడెదు" (2-171); "ఏనికతోలుపచ్చడము" (2-172) అనుపద్యము లచ్చతెనుఁగు పదములతోఁ గూడి యున్నవి. సోమన కవిత్వము ప్రౌఢమై నిర్దుష్టముగా నుండును. అన్నాదమ్ములు, అల్లిందామరయును బోలె అను ప్రయోగములు కొందరు వ్యాకర్తలచే నంగీకరింపఁబడినవే "వానికెన్దలల్ గలవు" (5-87) అనుచోట ఎన్ని యందలి చివరి నివర్ణము లోపించినది.

వీరల్గోపించిన" (4-58) అను ప్రయోగమునఁ దెనుఁగుమీఁది సంస్కృత కకారమునకు గాకారాదేశము చేయఁబడినది. "వ్రేలెడు గోచిం బరియలయిన కరకమునయి"(4-79) అనుచోట గోచిన్ అనఁగా గోచియును అని యర్థము. "ఆ తల నాతలఁ కేలా (1-115) అనుచో నాతల యనఁగా నవతల (పిమ్మట) ననియర్థము. ఎక్కాడు అను ధాతువును శబ్దరత్నాకరము ఎక్కు+ఆడు అని విడఁదీసినది. ఎక్కి+ఆడు అని విడఁ దీసినచో క్త్వార్థకేకారమునకు సంధిచేసినట్లగును. కృష్ణుఁడు పౌండ్రకవధానంతరము ద్యూతమాడు సమయమున పెద్దలువచ్చి కాశిరాజు పంపిన కృత్య పురమెల్లఁ గాల్చుచున్న దని తెలుప కృష్ణుఁడు "దాయమెత్తనో యీసారి" (8-141) అని వచ్చినవారికిని, ఆడుచున్న సత్యకును తగినరీతి నర్థమగునట్లుగా నొకేసమాధాన మొసంగెను. దానిని సావాసులు వీరవచన చతురతగా భావించియు సత్య నెత్తపుమాటలుగాఁ దలంచియు సంతోషించిరి.

సోమనకు తిక్కనపై గురుభావము కలదు. అతఁడు తన కావ్యమును తిక్కన సోమయాజి మహాభారత కథానంతరమని పల్కి దానిని హరిహరనాథునికే అంకితము చేయుటయందును, యుద్ధవర్ణన సందర్భములందును, జనార్దను రాయబారము వర్ణించు పట్టునను ఆ గురుత్వము గోచరించును. శ్రీనాథుఁడు, పోతన, ప్రబంధకవులు మున్నగు తరువాతికవులపై సోమన రచనా ప్రభావము పెక్కుచోట్లఁ గనిపించును. ద్వితీయాశ్వాసమున శివుఁడు మదన దహనవృత్తాంతము తెల్పునపుడు సోమన "మక రందమాని మైమఱచిన గొనయంబు నెట్రమోయగడివోని వింటితోడ" (5-194) అను పద్యమున వలరాజు నాగమనమును వర్ణించెను. శ్రీనాథుఁడు హరవిలాసము నందీ సందర్భమున కాళిదాసుని శ్లోకము ననుసరించుచునే "కాంతాజనంబుల కరివంక బొమలతోఁ బ్రతివచ్చు పుష్పచాపంబుతోడ" అని సోమన పద్యము ననుకరించెను. పోతన నరకాసుర సంహారము వర్ణించునెడను, అంత్యానుప్రాసములు రచించునెడను, సోమననే ఒజ్జబంతిగా గ్రహించుట సుస్పష్టము. ''ఆకాశగంగ నీ యడుగునఁ బొడమె నీకిట్లర్ఘ్య పాద్యంబు లిచ్చుటెంత'' (2-115) అను సోమన పద్యమునకు వసుచరిత్ర ద్వితీయాశ్వాసమునఁ బ్రతిబింబమున్నది. తరువాతికవులలోఁ బలువురు సోమన కవి త్వము చదివి 'ఓహో'అని మెచ్చి అతని నొరవడిగా గ్రహించిన వారే.

సోమన పాండితీప్రతిభావిశేషములు రెండు నేకమూర్తియైన కవివరేణ్యుఁడు. సర్వజ్ఞుఁడు. అతని కవితాధార హిమగిరిశిఖరములనుండి ఉరవడితోఁ బ్రవహించు గంగాప్రవాహమున కెనయై యుండును. కవిత్రయము వారి రచన నిర్మలమైన నభో గంగ. వారు ఋషిప్రాయులు. సోమన మహాకవి, సంస్కృతమునకు వాల్మీకి వ్యాసు లకును శ్రీహర్షాదులకును గల తారతమ్యమే ఆంధ్రమున కవిత్రయము వారికిని సోమనకును గలదని చెప్పవచ్చును.

# పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు

## - ఆచార్య బి.రామరాజు

మన సాహిత్యచరిత్రకారులు చెప్పే పురాణయుగం, ప్రబంధయుగం ఈ రెండింటి సంధికాలాన ఉండిన గొప్పకవుల్లో పిల్లలమఱ్ఱి పినవీరభద్రు డొకడు, ఈ యుగాన్ని శ్రీనాథయుగమని కూడ అంటారు. శ్రీనాథుడు నిండుజవ్వనంలో ఉన్నప్పుడు పినవీరన చిరుతకూకటివాడు. 15 శతాబ్దం రెండోపాదం మొదటనో చివరనో పుట్టి ఆశతాబ్దం చివరదాకా పినవీరన సాహిత్యవ్యాసంగం చేసినట్లు మనం భావించవచ్చు. ఇంటిపేరునుబట్టి తెలంగాణంలో పుట్టినా బ్రతుకుకోసం పాకనాటిలోని బిట్రగుంటలోనో సోమరాజుపల్లిలోనో కొంతకాలం ఉండి, పేరు పెంపులు సంపాదించుకొని, ప్రాభవంకోసం పినవీరన రాయసామ్రాజ్యానికి వలసపోయినట్లున్నాడు. చాలామంది గొప్పవాళ్ళవలెనే పినవీరన తననుగూర్చి కాని తన పూర్వులగూర్చికాని ఎక్కువ వివరంగా చెప్పుకోలేదు. శాకుంతల కావ్యంలో తన గురువు భారతీతీర్థులమీద ఒక పద్యం, జైమినిభారతంలో తన యింటిపేరునుగూర్చి ఒక పద్యం, ఈ రెండు కృతుల్లోను తన తలిదండ్రులైన నాగమ్మ గాదన్నల పేర్లు చెప్పినాడు. తాను శివభజనాసక్తుడననీ, వీరభద్రపదపద్మధ్యానశుద్ధాంతరంగుడననీ, కళ్యాపాన్వయుడననీ చెప్పుకున్నాడు. ఇంతకంటె ఎక్కువవివరాలు చెప్పలేదు.

నూరు నూట యాభై యేండ్ల తరువాత పిల్లలమఱ్ఱి వంశానికే చెందిన మరొకకవి పెనుమళ్ళ సోమయ్య అనేవాడు తన సీమంతినీపరిణయంలో గాదన్న నాగమ్మ దంపతులు పిల్లలమఱ్ఱిలో ఉండినందున వారి కాయింటి పేరు వచ్చిందనీ, వాళ్ళకు దీర్ఘకాలందాకా సంతానం కలుగకపోతే శ్రీశైల ప్రాంతవాసియైన భారతీతీర్థులనే యతీశ్వరుణ్ణి సేవించి శివానుగ్రహంచేత ఇద్దరు కొడుకులను కన్నారనీ, పెద్దవాడు పెదవీరభద్రుడనీ చిన్నవాడు పినవీరభద్రుడనీ, ఈపినవీరభద్రుడు పుట్టుకతోనే వీరభద్రాంశతో జడలతో పుట్టినాడనీ, చిన్నప్రాయంలోనే అఖిలశాస్త్రాలు అభ్యసించి కాళిదాసాది

కవులకంటె హెచ్చుగా బహుకావ్యరచనాప్రౌఢి గాంచినాడనీ "వాణి యిల్లాలుగా కవిశ్రేణికెల్ల, పృథుతరాశ్చర్యకరమైన బిరుదు పూనె"ననీ, సేతు శీతాచలాలు మధ్య అతనికి సాటివచ్చే మరోకవి లేడనీ చాలా గొప్పగా చెప్పినాడట.

మన సాహిత్యచరిత్రలోనేకాదు ఇతరభాషా సాహిత్యచరిత్రల్లో కూడా ఈ గొప్పవాళ్ళ మూలంగా అప్పుడప్పుడు కొన్ని చిక్కు లేర్పడుతవి. వాళ్ళేమో తమ గురించి అంతగా చెప్పుకోరు. తరువాత కాలాన వాళ్ళను అభిమానించేవారు వారివారి మహిమాతిశయాలను చాటే చిత్రాతిచిత్రములైన కథ లల్లుతారు. కిట్టనివారు అప ఖ్యాతిపాలు చేసే మరోతీరు కథ లల్లుతారు. పినవీరభద్రుని గురించికూడా ఇట్లాగే జరిగి ఉంటుంది. అతని మహిమాతిశయాలు చాటే రెండుమూడు కథలూ, వాటికి తగిన చాటుపద్యాలు పుట్టినవి. అందులో మొదటికథ. ఒకసారి శ్రీనాథుడు పిన వీరన్నకు తననైషధాంధ్రీకరణం వినిపింతామని వచ్చినాడట. అప్పుడు పినవీరన్న వీధిలో గోలీలు ఆడుతున్నాడట. గమికర్మీకృతనైకనీవృతః అనేదాన్ని ఎట్లా అను వదించినావు అని అడిగితే శ్రీనాథుడు గమికర్మీకృతనైకనీవృతుడనై అన్నాడట. ఇందులో 'నై' ఒకటితప్ప నీదేముంది? అని పినవీరన ఆక్షేపిస్తే శ్రీనాథుడు చిన్న బుచ్చుకొనిపోయినాడట. రెండవది 'వాణి నారాణి' అనే కథ. సాళువ నరసింహరాయ లకు జైమినిభారతం ఆంధ్రీకరించి కృతి యిస్తానని చెప్పిన గడువుకు ఒకనాడు ముందువరకూ పినవీరన్న ఘంటమే పట్టలేదట. రేపు కృతి ఇస్తాడనగా ఆ రాత్రి సరస్వతీదేవి పినవీరన్నగదిలో కూర్చొని జైమినిభారతం దాదాపు వ్రాసిపెట్టిందట తెల్లవారు జామున తాటాకుల గలగలలూ ఘంటం గరగరలూ విని ఏమిటా అని పెద వీరన్న తలుపుసందులోనుంచి చూస్తే బావగారు చూస్తున్నారని మరదలు సరస్వతమ్మ సిగ్గుపడి మాయమైపోయిందట. ఆమె విడిచిపోయిన కొదవమాత్రం పినవీరన్న ముగించి తెల్లవారి అనుకున్నవేళకు నరసింహరాయలకు కృతిసమర్పణోత్సవం చేసి నాడట. పిన్నవీరన్న రెండుకృతులూ చదివితే ఆ మహానుభావుడు శ్రీనాథుని పద్యపు ఎత్తుగడలే కాదు సమాసాలకు సమాసాలు పాదాలకు పాదాలు వాడుకొని అనుసరించి అనుకరించి శ్రీనాథునియెడ కనబరచిన గౌరవాభిమానాలూ, శ్రీశారదాదేవియెడ ప్రద ర్శించిన భక్తి ప్రపత్తులూ! ఈ దంతకథలు కల్పించిన వాళ్ళెంత అఘాయిత్యానికి పాలు పడ్డారో తెలుపుతవి. తెలుగుజైమినిభారతం నిజంగా ఆ వాణియే వ్రాసిపెడితే అంత మాత్రపు కవిత్వానికి ఆమెనొక దేవతగా ఎవ్వరూ ఉపాసించనక్కర లేదు.

పినవీరభద్రుడు కాళిదాసాది సంస్కృత కవులనేకాదు నన్నయ తిక్కనాది తెలుగు కవులనూ చాలా చోట్ల అనుకరించినాడు. శ్రీనాథునిప్రభావం ఈతని కృతుల్లో అపారంగా కనపడుతుంది. శ్రీనాథుణ్ణి వెక్కిరించిన పినవీరన తన శాకుంతల కావ్యంలో "సదసత్సంశయ గోచరోదరి సుధాసంభాధబింబాధరిన్ (II-178)" అని శ్రీనాథుణ్ణి అనుకరిస్తాడా? ఇదొక్కటే కాదు కృతిపతి వర్ణనంలో నగరవర్ణనంలో నాయికా నాయకుల వర్ణనంలో పదులకొలది పద్యాల్లో శ్రీనాథుని అడుగుజాడల్లో నడచి ఆతనియెడ గౌరవాభిమానాలు ప్రకటించిన పినవీరన్నకు శ్రీనాథునికంటె గొప్పవాడనే కీర్తి తేవటానికి ఎవరో ప్రయత్నంచేసి తమకు తెలియకుండా ఆతనికి అపచారం చేసి నారనుకోవాలె. వాణి నారాణి అనేదికూడ ఎంత పొరపాటు కథో జైమినిభారతం గూర్చి చెప్పినప్పుడు మనవిచేస్తాను.

ఇక పినవీరన తన్నుగూర్చి, తన వంశంగూర్చి తన గురువులగూర్చి తన ఉభయకృతుల్లో ఏమిచెప్పకున్నాడో చిత్తగించండి. సాళువ నరసింహరాయల పేరోలగపు సభాసదులు పినవీరన్నను ఈ విధంగా ప్రశంసిస్తారు.

క॥ తాతయుఁ దండ్రియు నగ్ర
భ్రాతయునుం దాను భువనభాసుర కృతి ని
ర్మాతలు పిల్లలమఱి వి
ఖ్యాతునిఁ బినవీరుఁ బోలఁగలరే సుకవుల్ (జై.భా 2-21)

సీ॥ అమృతాంశుమండలం బాలవాలము గాఁగ మొలిచె నొక్కటి జగన్మోహనముగఁ
జిగిరించె విలయపింధుగతకైతవడింభ శయనీయవరపలాశములతోడఁ
బితృదేవతలకు నంచిత సత్రశాలయై చెట్టుగట్టెను గయాక్షేత్రసీమ
నిలువ నీడయ్యె నిందీవరప్రియకళా కోటీరునకు భోగికుండలునకు

తే॥ మఱ్ఱి మాత్రంబె పిల్లలమఱ్ఱి పేరు
పేరువలెఁగాదు శారదాపీఠకంబు
వారిలోపలఁ బినవీరు వాక్యసరణి
సరసులకు నెన్న కర్ణరసాయనంబు. (2-22)

ఈ మాటలు సభాసదుల నోట విన్న సాళువ నరసింహరాయలు పినవీరన కవిత్వాన్ని ఈవిధంగా ప్రశంసిస్తాడు.

ఉ॥ అల్లనవిచ్చు చెంగలువలందు రసంబను కప్పురంబు పైఁ
జల్లఁగఁ జల్లనై వలచు సౌరభముల్ వెదచల్లు భావముల్
పల్లవహస్త చన్నుఁగవ పయ్యెద జీబుగఁ దోఁచు భాతిగాఁ
పిల్లలమఱ్ఱివీరన యభిజ్ఞుఁడు చెప్పఁగనేర్చుఁ గబ్బముల్ (2-25)

శాకుంతలం పీఠికలో వినవీరన తనగురువు భారతీతీర్థులను ఈ విధంగా స్తుతించినాడు.

సీ॥ నన్నపార్యుని ప్రబంధప్రౌఢవాసనాసంపత్తి సొంపు పుట్టింప నేర్చుఁ
దిక్కనయజ్వ వాక్పక్కికాామోదంబు చెలువు కర్ణముల వాసింప నేర్చుఁ
నాచిరాజుని సోము వాదామహత్త్వంబు సౌరభంబులు వెదచల్లనేర్చు
శ్రీనాథభట్టు భాషానిగుంఫంబుల పరిమళంబులఁ గూడ బఱచ నేర్చు

తే॥ మహితగుణశాలి పిల్లలమఱ్ఱి వీర
నార్యుఁ డాయింటఁ బైతామహం బగుచును
వెలయుచున్నది నేఁడు కవిత్వలక్ష్మి
యఖిలసత్కవి నికరంబు నాదరింప. (1-19)

ఈ పై పద్యం ప్రక్షిప్తమని కొంద రంటారు. అట్లాగే కావచ్చు.

క॥ అసుకవిచేత శివభజ
నాసక్తునిచేతఁ గశ్యపాన్వయుచేతన్
భాసుర నవకవితా ల
క్ష్మిసదనునిచేత వలయుఁ గృతిఁ జెప్పింపన్. (1-20)

మ॥ అని సాధ్వీమణి నాగమాంబకును విద్యాభారతీజాని గా
దనకుం బుత్రుని వీరభద్రపదపద్మధ్యాన శుద్ధాంతరం
గుని నన్నుం బిలిపించి లోనఁ దనకోర్కుల్ సందడింపఁగ మ
న్నన దైవాఱఁగ గారవించి పలికె న్గంభీర వాక్ప్రౌఢిమన్. (1-21)

సీ॥ రచియించినాఁడవు రమణీయ వాగ్రీతి నవతారదర్పణం బభినవముగఁ
బల్కినాఁడవు తేటపడఁజేసి నారదీయము సత్కవిశ్రేణి యాదరింపఁ
జెప్పినాఁడవు శేముషీవిశేషంబున మాఘమాహాత్మ్యంబు మంజువాణిఁ
గావించినాఁడవు ఘనబుద్ధి మానసోల్లాససారము సముల్లసితశయ్య

తే॥ భారతీతీర్థ యతిసార్వభౌమగురు కృ
పాతిశయలబ్ధకవితావిభూతి గలిగి
గౌరవము గాంచినాఁడవు కవులచేత
విపులచాటూక్తి నిర్నిద్రః వీరభద్రః (1-22)

గీ॥ కలదు చాలంగఁ బ్రేమ నీవలననాకు
వేడ్క నడిగెదఁ గవులెల్ల వేడ్క పడఁగ
షట్సహస్రకులోద్భవ సచివులందు
సుకృతిగాఁ జేయు నాకొక సుకృతిఁజేసి. (1-23)

పినవీరన రచించిన అవతారదర్పణం, నారదీయం, మాఘమాహాత్మ్యం మానసోల్లాససారం ఏమైపోయినాయో కాని మనకు ఈనాడు దక్కినవి రెండేకృతులు. అందులో మొదటిది శృంగారశాకుంతలమని పిలువబడే శాకుంతల ప్రబంధం; రెండవది జైమిని భారతం అనువాదం. మొదటిది సోమరాజుపల్లి ఏలిక చిల్లర వెన్నయకు రెండోది సాళువ నరసింహరాయలకు అంకితం.

## శాకుంతల కావ్యం :-

కృతిపతియైన చిల్లర వెన్నయామాత్యుడు శాకుంతలకావ్యం వ్రాసి తనకు అంకితం ఇమ్మని పినవీరభద్రయ్యను కోరుతాడు. కావ్యేతివృత్తమూ, రసమూ, కథాసంవిధానమూ ఎట్లుండవలెనో ఈవిధంగా చెప్పుతాడు.

శా॥ ప్రఖ్యాతంబన మిశ్రబంధమన నుత్పాద్యం బనంగాఁ ద్రిథా
వ్యాఖ్యాతంబగు వస్తువందు మఱి యధ్యాహారముం జేయఁగాఁ
బ్రఖ్యాతం బితివృత్తమైన కృతినెప్పన్ వక్తకున్ శ్రోతకున్
విఖ్యాతిం గలిగించుఁ బుణ్య మహిమన్ విశ్వంభరామండలిన్.
(1-24)

క॥ శృంగారము ముఖ్యంబగు
నంగియు నంగములుఁ దలఁప నన్యరసములున్
సాంగమగునేనిఁ దంకము
బంగారముతోడి యొఱ ప్రబంధము వొందున్. (1-25)

సీ॥ సరపువ్వులుగ మాలకరి పెక్కుతెఱఁగుల విరుల నెత్తులుగఁ గావించినట్లు
కర్పూర కస్తూరికా వస్తువితతిచే శ్రీఖండచర్చ వాసించినట్లు
లౌడికంబుగా గఁదవాడికి నానానూనపరిమళంబులు గూడఁ బఱచినట్లు
సరఘలు వివిధ పుష్పమరందలవములు గొనివచ్చి తేనియఁ గూర్చినట్లు

తే॥ భారతప్రోక్తకథ మూలకారణముగఁ
గాళిదాసుని నాటకక్రమము కొంత
తావకోక్తికి నభినవశ్రీ వహింపఁ
గూర్మిఁ గృతిసేయు నాకు శాకుంతలంబు. (1-27)

ఇతివృత్తం ప్రఖ్యాతమైననది కావలెననీ, ప్రధానరసం శృంగారం కావలెననీ, వ్యాస కాళిదాస ప్రోక్తమైన కథఐనా అభినవోక్తి సంపన్నమైన గ్రథనం కావలెననీ ఈ పద్యాల సారాంశం.

మన ప్రాచీనమహాకవులందరూ ప్రఖ్యాతేతి వృత్తమే ఎన్నుకోవటానికి కారణం-అది ఒక ఆదర్శంగా ఉండవలెనని. ఎందుకయ్యా ఈ ఆదర్శం అంటే సంశ్రేయస్సుకు అదొక వెలుగుబాటగా వాళ్ళు భావించటం. మన ఋషులూ వారి అడుగుజాడల్లో నడచిన మహాకవులు సాంఘికవ్యవస్థ కట్టుదిట్టంగా ఇహపరసాధకంగా ఉండటానికై చతుర్విధపురుషార్థాలు చెప్పినారు. ఇవి ధర్మార్థకామమోక్షాలు. ఈనాడు నాల్గోపురుషార్థం కొందరు అనవసరమనుకొన్నా మొదటి మూడు మాత్రం అందరికీ ఉపాదేయాలే కదా! మొదటిదికూడ అక్కరలేదంటే సంఘానికి మిగిలేది అరాజకత్వం, అవ్యవస్థ. అర్థకామాలు అందరూ కోరేవే. ఐతే అవి ధర్మానికి లోబడి ఉండాలె. ధర్మవిరహితమైన అర్థకామాలు విజృంభిస్తే ప్రపంచం అంతా పాశవికమై పోయి ప్రళయం సంభవిస్తుంది. అందుకోసమే ఋషులైన కవులేకాదు లౌకికమహా కవులందరూ సంస్కృతకవులు కానీయండి, దేశభాషాకవులు కానీయండి సంఘశ్రేయస్సును కోరినవారై ఈనాలుగు పురుషార్థాల సాధనకై పురాణం వ్రాసినా ఇతిహాసం వ్రాసినా నాటకం వ్రాసినా ఏప్రక్రియ చేపట్టినా సంఘంముందు ఒక ఆదర్శం ఉంచటానికై ప్రయత్నం చేసినారు. కాళిదాసు భవభూతి భారవి మాఘుడు మొదలైన సంస్కృతకవులు కానీయండి నన్నయాది తెలుగుకవులు కానీయండి తమ తమ కాలాల కనుగుణంగా ప్రఖ్యాతేతి వృత్తాలను గ్రహించి స్వీయకృతులను చతుర్విధ పురుషార్థసాధనోపదేశకాలుగా తీర్చిదిద్దినారు. అసలు మన ఉత్తమ సాహిత్యమంతా

రాజనీతి కోసమే పుట్టిందని సాహిత్య మర్మజ్ఞు లంటారు. రాజనీతి ప్రాచీనకాలంలో రాచరికం నెరపినవారికే కావచ్చు. రాచరికంపోయి ప్రజాస్వామ్యం వచ్చిందనుకొనే ఈనాడు కూడ పాలకులు ఎట్లా ఉండవలె, ఉద్యోగులు ఎట్లా ఉండవలె, ప్రజలు ఎట్లా ఉండవలె, ఆర్థిక, సామాజిక, వాణిజ్య, సైనిక, అంతర్జాతీయ నీతి ఎట్లా ఉండవలెనని చెప్పేదికూడ రాజనీతియే. ఇందులో కాలానుగుణమైన మార్పులూ చేర్పులూ తప్పవు. ఐతే సాంఘిక శ్రేయస్సుకైన చదుర్విధ పురుషార్థాలను సమన్వయించే ఆదర్శం అందరూ కోరేదే. అందుకే ప్రఖ్యాతమైన ఇతివృత్తం కావాలెననటం. శాకుంతల కావ్యంలో కూడ చిట్టచివరన నారదుడు భరతునికి రాజనీతిని బోధిస్తాడు.

రెండవది శృంగారం. ఇది సమస్తప్రాణికోటి కోరేది. అందుకే దీనిని రస రాట్టు అన్నారు. జీవజాలంలో ఉత్తమశ్రేణికి చెందిన వాళ్ళమనుకునే మానవులు దీన్ని ఉదాత్తంగా భజించాలె. తిర్యగ్జంతువుల్లో దాన్ని దర్శించి ఉన్మీలితులు కావాలె. ఇదే భౌతికకక్ష్యనుండి చాలాదూరంపోయి ఆనందపర్యవసాయి ఔతుంది. కృతికర్తా కృతిభర్తా శృంగారం అంగిగా ఉండవలెననీ కోరుకొన్నారిందుకే. ఐతే తక్కిన అంగర సాలు యథోచితంగా ఉండవలెనని కూడా అనుకొన్నారు.

మూడవది పైరెండింటి నిర్వహణంలోను కథాకథనంలోను సంఘటనల గ్రథనంలోను పినవీరన సొంతంగా మౌలికంగా తనభాషకు సహజంగా ప్రదర్శించే అభినవోక్తి చాతురి.

మహాభారతం ఇతిహాసం. ఇందులో శకుంతలా వృత్తాంతం ఒక చిన్న ఉపాఖ్యానం. మనదేశానికి భరతవర్షం అనీ, పాండవుల వంశానికి భరతవంశం అనీ పేర్లు రావటానికి కారకుడు భరతుడు. అతని తలిదండ్రులు శకుంతలాదుష్యంతులు. అందువలన శకుంతలోపాఖ్యానానికి భారతంలో ప్రసక్తి కలిగింది. ఈ వృత్తాంతం మహాభారతంలో ఐదారు పాత్రలతో చాలాక్లుప్తంగా ఇతిహాసప్రయోజనాలైన సత్యధర్మాల ప్రతిష్ఠ కనుకూలంగా సాగింది. ఈ కథను మహాకవికాళిదాసు గ్రహించి 26 పాత్రలతో శృంగారరసానుగుణంగా నాటకోచితమైనమార్పులతో చేర్పులతో నూతనకల్పనలతో, ఔచిత్యపోషణంతో, సరససంభాషణలతో ఉదాత్తమైనపాత్రలతో లోకోత్తరమైన ఏడంకాలనాటకం అభిజ్ఞానశాకుంతలం పేరుతో రచించినాడు. ప్రపంచప్రఖ్యాతి పొందిన నాటకాల్లో అభిజ్ఞానశాకుంతలం అగ్రశ్రేణికి చెందినది. పిల్లలమఱ్ఱి పినవీరన్న వ్యాస కాళిదాసుల కథల్లోనుండి తనప్రణాళికకు అవసరమైన

వాటికి తీసికొని కొన్నిమార్పులు, కల్పనలుచేసి వర్ణన ప్రధానమైన నాలుగాశ్వాసాల ప్రబంధంగా తీర్చి దిద్దినాఁడు

తెలుగులో కావ్యప్రబంధ ప్రక్రియకు నన్నిచోడుడే శ్రీకారం చుట్టినా రాయల యుగంవరకు దానివిషయమై ప్రత్యేకదృష్టి సారించినవాళ్ళు ఎక్కువగా లేరు. శ్రీనాథునియుగంలో ముందుముందు రాబోయే ప్రబంధయుగం లక్షణాలు అంటే అష్టాదశవర్ణనల్లోను, రీతి ప్రధానమైన రచనంలోను, తీరుతీరైన పద్యాల ఎత్తుగడల్లోను ఒక్కొక్కరు ఒక్కొక్క పద్ధతిలో ముందడుగు వేసినారు. అటువంటి వారిలో మన పిల్లలమఱ్ఱి పినవీరభద్రు డొకడు.

శాకుంతలకావ్యంలోని విషయం క్లుప్తంగా ఈ విధంగా ఉంటుంది. ప్రథమాశ్వాసంలో హస్తినాపురవైభవం, అక్కడి చాతుర్వర్ణ్యాలు. హయగజపదాతివర్గం, వారవనితలు, పుష్పలావికలు, ప్రభువైన దుష్యంతుని గుణగణాలు ఆతని వైభవం, పుళిందులు వచ్చి కానుకలిచ్చి దుష్యంతుణ్ణి వేట కాహ్వానించుటం, దుష్యంతుని మృగయాసన్నాహం, వేటకుక్కలు, వేటకాండ్రు, దుష్యంతుని రథహయాల వేగాతిశయం, గొల్లపల్లెవారి స్వాగతం, నర్మసచివుడైన మాంధవ్యుడు శకునాలు చెప్పటం, గొల్లవారి ఆతిథ్యం వర్ణించబడినవి. ఇందులోని చాలాభాగం పినవీరన స్వోపజ్ఞం. దుష్యంతుడు వేటకుపోవటమనే దొక్కటే వ్యాసకాళిదాసులు చెప్పినది. రథాశ్వాల వేగాతిశయం కాళిదాసు కూడ చెప్పినాడు.

ద్వితీయాశ్వాసంలో దుష్యంతుని వేట, ఆతడొక జింకను తరుముకొని పోవటం, మున్యాశ్రమ ప్రశాంతరామణీయకం, ఒకవృద్ధముని ఆ జింకను కొట్టవద్దని రాజును వారించటం, ముని శపిస్తాడో యేమో అని దుష్యంతుడు భయపడటం, కణ్వాశ్రమ సాత్త్విక గుణసంపత్తి, అనసూయా ప్రియంవదా శకుంతలలు చెట్లకు నీళ్ళుపోస్తూ దుష్యంతుని కంటపడటం, శకుంతలా సౌందర్యం, శకుంతలను తుమ్మెద బాధించటం, ఆ బాధ నివారించే నెపంతో దుష్యంతుడు వారియెదుట ప్రత్యక్షం కావటం, శకుంతలా దుష్యంతుల మనోజవికారం, శకుంతల ఒక మునిశిష్యుణ్ణి దుష్యంతుని ఆశ్రమానికి తీసుకరావటానికై పంపటం, దుష్యంతు డా మునిశిష్యుణ్ణి శకుంతలావృత్తాంతం అడగటం, మునిశిష్యుడు శకుంతలాజన్మవృత్తాంతం దీర్ఘంగా వినిపించటం, ఈ సందర్భంగా హిమాలయాల వర్ణనం, విశ్వామిత్రుని తపస్సు, ఇంద్రు డాతని తపస్సు చెరపటానికి మేనకాది అప్సరసలను పంపటం, వసంతావిర్భావం, అప్సరసల

కుసుమాపచయ క్రీడలు, విశ్వామిత్రుని తపోభంగం, శకుంతలా జననం, కణ్వుడామెను పెంచటం, — ఇదంతా విన్న తరువాత దుష్యంతుడు మునిశిష్యుని వెంట ఆతిథ్య స్వీకారానికై బయలుదేరటం, ఇంతలో హఠాత్తుగా ఒక పెద్దపులి అరచుకుంటూ రావటం, మునిశిష్యుడు భయపడటం, దుష్యంతుడా పెద్దపులి తనవేటపులుల్లో నుంచి తప్పించుకొని వచ్చిందిగా గుర్తించి దాన్నిపట్టుకొని మళ్ళా మృగయుల కప్పజెప్పటానికి తనస్కంధావారానికిపోతూ శకుంతల తనకు ఎట్లా దక్కుతుందా అని తీరుతీరుల తలపోయటం, నర్మసచివుడైన మాండవ్యుడు రాజుగారి మనోవిచారం ప్రశ్నించటం, దుష్యంతుడు మాండవ్యునికి శకుంతలాసౌందర్యం దీర్ఘంగా వర్ణించి చెప్పటం, ఇక్కడ ఆశ్రమంలో శకుంతల పెద్దపులి అంతరాయకారణంగాను ఇంతలోనే అపరసంధ్యకావటం మూలంగాను దుష్యంతుడు తన ఆతిథ్యం స్వీకరించ రాలేకపోయిన సంగతీ, మునిశిష్యునిద్వారా తన జన్మవృత్తాంతం విన్నసంగతీ తెలిసికొని విరహతాపం చెందటం అనే విషయాలున్నవి. ఇందులో మునిశిష్యుని నోట శకుంతలా వృత్తాంతం చెప్పించటం పులి కారణంగా ఆతిథ్యానికి పోకపోవటం వంటివి కావ్యప్రయోజనం దృష్ట్యా పినవీరభద్రుడు చేసిన క్రొత్త కల్పనలు. తక్కినవి కూడా భారతంలోను నాటకంలోను ఉన్న వానిని కొద్దిమార్పులతో ప్రబంధోచితవర్ణనలతో చాలా దీర్ఘంగా పెంచి వ్రాసినాడు- పినవీరభద్రుడు.

తృతీయాశ్వాసంలో దుష్యంతుడు వేటరులను హస్తినాపురికి మరలించటం, కణ్వాశ్రమమునులు దుష్యంతుణ్ణి అతిరాత్రసవన రక్షణం చేయుమని కోరటం, దుష్యంతుడు యజ్ఞశాలలను దర్శించటం, మాకందుడనే రాక్షసమంత్రి రాక్షసప్రభువైన కాళికాముఖునికి దుష్యంతుని పరాక్రమం వివరించటం ప్రథమదిన సవనరక్షణం, దుష్యంతుణ్ణి మునులు విశ్రాంతికై పంపటం, దుష్యంతుడు విరాళిపొంది పూర్వం శకుంతలను చూచిన తరుసేచన స్థలానికి పోవటం, అక్కడ శకుంతలకు అనసూయా ప్రియంవదలు శైత్యోపచారాలు చేస్తుండటం, ఆమె మనస్సులోని విషయంవాళ్ళు తెలిసికోవటం, శకుంతలా దుష్యంతుల సమావేశం, దుష్యంతుని శపథం, శకుంతలా దుష్యంతుల గాంధర్వవివాహం, ఇంతలోగా రాక్షసుల రణభేరీరావం విని మునులు ఆర్తారావాలు చేయటం, దుష్యంతుడు శకుంతలను విడిచి యుద్ధసన్నద్ధుడై పోయి మునులభీతిని అపనయించి యుద్ధానికి తలపడటం, దీర్ఘమైన ఘోరసంగ్రామం, రాక్షససంహారం, సూర్యాస్తమయం, చంద్రోదయం, దుష్యంతుని మదనతాపం, శకుంతల విరహం, చంద్రమన్మథోపాలంభనాలు, ప్రత్యూషం, సూర్యోదయం, దుష్యంతుడు శకుంతలను

కలిసికోవటం, వాళ్ళిద్దరూ రేయింబవళ్ళు ఏడుదినాలు దాంపత్యం నెరపటం, హస్తిన నుండి సైన్యాలు రావటం, దుష్యంతుడు మునులయెడ వినయం ప్రదర్శించటం, శకుంతలను ఆశ్రమంలోనే విడిచి హస్తినకు ప్రయాణం కావటం, శకుంతల దుఃఖం, సఖు లామెను సాంత్వన పరచటం, ఏడునాళ్ళలో పిలిపించుకుంటానని చెప్పి అభిజ్ఞానాంగుళిని ఇచ్చి దుష్యంతుడు వెళ్ళిపోవటం అనేవి ఉన్నవి. ఇందులోని విషయాలు సంఘటనలు తన కావ్యశరీరపుష్టికోసం పినవీరన కల్పించినవే.

నాల్గో ఆశ్వాసంలో సోమతీర్థంలో కణ్వుడు శకుంతలా దుష్యంతుల వృత్తాంతం అంతా దివ్యదృష్టితో గ్రహించి పరమశివుని కృపను ప్రస్తుతించటం, తన ఆశ్రమానికి కణ్వుడు తిరిగిరావటం, శకుంతలను, చూచి సంతోషించి యిష్టసల్లాపాలు చేయటం, ఆశ్రమమునులు కణ్వుని దగ్గరికి రావటం. కణ్వుడు ఆశ్రమమునులకు చంద్రుడు దాదిగా దుష్యంతునివరకు ఆ వంశప్రశస్తిని వర్ణించిచెప్పి శకుంతల దాంపత్యానికి వారి ఆమోదాన్ని పొంది స్నానానికి పోవటం, అదే సమయంలో దుర్వాసుడు వచ్చి భర్తృమనస్కయై యున్న శకుంతలను శపించిపోవటం, అది గమనించిన అనసూయ దుర్వాసుణ్ణి బతిమాలి శాపావధి తెలిసికోవటం, శకుంతల గర్భం, భరతుని జననం, పురుటివేడుకలు, భరతుని అనుపమశైశవక్రీడలు, విద్యాభ్యాసం, కణ్వుడు శకుంతలకు కులసతీధర్మాలు దీర్ఘంగా చెప్పటం. శకుంతల ప్రయాణం సందర్భంగా కణ్వుని దుఃఖం, కణ్వుడు శకుంతలకు హితోపదేశం చేయటం, శకుంతల పితృవియోగాకులత, కతిపయమునిపత్నులతో సఖులతో మునిశిష్యులతో పుత్ర సమేతంగా శకుంతల హస్తిన ప్రవేశించటం, కణ్వసందేశం మునిశిష్యులు దుష్యంతునికి వినిపించటం, దుష్యంతుని విపరీతవాదం, అనసూయా ప్రియంవదలు దుష్యంతుణ్ణి ఆక్షేపించటం, ఆకాశవాణి పల్కులు, అంగుళీయక మహిమ, దుష్యంతుడు తన పొరపాటుకు చింతించటం, నారదాగమనం, శకుంతల పట్టమహిషి కావటం, దుష్యంతుని పుత్రగాత్ర పరిష్వంగ సుఖం,భరతుని యౌవరాజ్యపట్టాభిషేకం, నారదుడు భరతునికి రాజనీతి బోధించటం, దుష్యంతుని సంతోషం, శకుంతలా దుష్యంతుల చిరకాల రాజ్యసౌఖ్యాలు అనేవి ఉన్నవి. ఇందులో కూడా పినవీరన ఇతిహాసనాటకాలకంటె భిన్నంగా ఎన్నో నూత్న కల్పనలు చేసినాడు. అందునుండి గ్రహించిన వాటిని తన ప్రణాళికకు అనుకూలంగా మార్పులతో కూర్పులతో మలచుకున్నాడు.

సాహిత్య చరిత్రకారులు, విమర్శకులు, కావ్యసంపాదకులు, పండితపరిశోధకులు శాకుంతలకావ్యంలోని అందచందాలు, పినవీరన వైశిష్ట్యం, పూర్వకవుల ప్రభావం,

తరువాతికవులమీద అతని ప్రభావం, మొదలైనవాటి గురించి విపులంగా చెప్పినారు. పినవీరన గురించి క్రొత్తగా చెప్పటానికి ఏమీలేదు. ఐనా ఇంతకుపూర్వం పండిత విమర్శకులు స్పృశించిన ఒక విషయాన్ని విపులీకరించి పూర్వకవుల కావ్యాలను ఏ విధంగా అధ్యయనం చేయాలెనో (How to strdy a classic) మనవి చేస్తాను.

రాజధానియైన హస్తినాపురవర్ణనంతో ఈ కావ్యకథ ప్రారంభమౌతుంది. అక్కడి విశేషాలన్నీ వర్ణించిన తరువాత కావ్యనాయకుడైన దుష్యంతుణ్ణి (87-95) తొమ్మిదిపద్యాలలో వర్ణిస్తాడు. అందులోని చివరపద్యం ఇది.

సీ॥ (1) చెఱుపనేరఁడు విశ్వసించి యుండినవాని
(2) నభిలషింపఁగ నేరఁ డన్యవనిత
(3) నిందింప నేరఁడు నీచశత్రుగణంబు
(4) బొంకనేరఁడు హాస్యమునకుఁ బలికి
(5) విడువనేరఁడు చెడ్డవిటునిఁ జేపట్టినఁ
(6) గడపనేరం డర్థిగణమువాంఛ
(7) నడుగువెట్టఁగ నేరఁ డపయశంబగు త్రోవఁ
(8) జనఁగ నేరం డార్తజనము విడిచి
తే॥ (9) యైదుపది సేయ నేరఁ డాహవముఖమునఁ
(10) గ్రించునందును నేరఁడు కీడొనర్ప
ననుచు నేరము లెన్నుదు రవనిజనులు
విపులయశుఁడైన దుష్యంత విభునివలన (1-95)

ఈ పద్యంలో ప్రభువు, కావ్యనాయకుడూ ఐన దుష్యంతుని మీద ఆనాటి జనం మోపిన పదినేరాలున్నవి. నిజంగా అవి నేరాలుకావుగదా చాలా గొప్పగుణాలు. ధీరోదాత్తుడైన ఒక మహానాయకుని గుణగణాలను వ్యాజస్తుతి రూపంగా పేర్కొని ఈ ఒక్కపద్యం కావ్యశరీరం అంతటా ఎట్లా వ్యాపింప చేసిందీ ఆయా సంఘటనలూ కథాంశాలు పిన వీరన ఏవిధంగా వ్యంజింప జేసిందీ పరిశీలిద్దాము. ఈ పదినేరాలను ఒక్కటొక్కటిగా తెలిసికొందాము.

(1) చెఱుపనేరఁడు విశ్వసించి యుండినవాని.

దుష్యంతుడు విశ్వాసఘాతుకుడు కాడని తాత్పర్యం. ఈ కావ్యంలో ఈ గుణం ఎట్లా విపులీకరింపబడిందో చూడండి. ద్వితీయాశ్వాసంలో వేటాడి వేటాడి దుష్యంతుడు

ఒక జింకను చూచి దాన్ని తరుముకుంటూ పోతాడు. ఆ జింక అతనిబాణానికి అంద కుండా మాలినీతీరందాకా పరుగెత్తి అలసిపోయి నిలచిపోతుంది. అది అసలు కణ్వా శ్రమమృగం. దారితప్పి దుష్యంతుడు వేటాడే అడవిలోకి పోయింది. ఇప్పుడు మళ్ళా ఆశ్రమప్రాంతానికి దగ్గరగా వచ్చింది. ఇందాకా తనకు అందకుండా పరుగెత్తివచ్చిన మృగాన్ని, అలసి నిలిచిపోయినదాన్ని దుష్యంతుడు సులభంగా చంపవచ్చును గదా! కాని చంపలేదు. ఎందుకు చంపలేదో చూడండి.

గీ॥ అచట మృగమును బోలేక యలసి నిలిచె
నానెలవు నాశ్రమాంతిక మగుటఁ జేసి
స్థలవిశేషం బదెట్టిదో ధరణిపతికి
హరిణపతిమీఁద నెంతయుఁ గరుణపుట్టె. (2-22)

వ॥ ఇత్తెఱంగునం గురంగంబు మీఁదఁ గురంగాంకకులీనుండు కృపాతరంగితాంత రంగుడై యేయకయుండం దత్తరంగిణీ తటంబున. (2-28)

కణ్వముస్యాశ్రమ ప్రశాంత వాతవరణం చూస్తాడు. అక్కడొక వృద్ధముని ఆ జింకను చంవవద్దని రాజును హెచ్చరిస్తాడు, ఎక్కడశపిస్తాడో అని భయపడే దుష్యంతుణ్ణి సాంత్వన పరచి దీవించి ఆ ముని ఆ ఆశ్రమసాత్త్వికగుణ సంపత్తిని ఈ విధంగా వర్ణిస్తాడు.

సీ॥ మునులు నిత్యస్నానములు దీర్చి యెడలక కాసారముల కంచ గదియ వెఱచు
మౌనిజనం బనుష్ఠానంబుఁ దీర్పక మృగశాబకము దర్భమేయ వెఱచు
సంయమీంద్రులు శివార్చనలు చెల్లింపక ప్రసవంబునకుఁ దేఁటి ముసర వెఱచుఁ
బారికాంక్షులు ఫలాహారతృప్తులుగాక కీరంబు పంటికిఁ జేరవెఱచుఁ

తే॥ దపసిజనములు నుతిమంత్రజపము లుడిగి
వచ్చి యుండక పికశిఖావళము లాది
గా వనంబునఁగల విహంగమకులంబు
తత్తరము నొంది నోరు వాయెత్త వెఱచు. (2-44)

సీ॥ వృద్ధసింహమునకు విహరింపఁ దొండంబు కైదండగా నిచ్చు గంధగజము
పులి క్రొత్త యీనిన పొదరింటిలోనికిఁ బురుటాలి తగవుఁ గొంపోవు హరిణి
శరభంబు కొనగోళ్ళ శిరము దువ్వఁగఁ జొక్కి కనుమోడ్చు సుఖనిద్ర గండకంబు
సింహకిశోరంబు చేరవచ్చిన వింత లేక చన్నిచ్చు బాలెంత కరిణి

తే॥ యెలుక తోడుతఁ జెరలాడు నెనసి పిల్లి
నెమ్మిఁ బురివిచ్చి నిలిచి పింఛమ్ము నీడ
భుజగకన్యక నాడించుఁ బూని నమలి
యనఘ కణ్వమునీంద్రు పుణ్యాశ్రమమున (2-45)

మరి యిటువంటి వాతావరణంలో పెరిగిన ఆ జింకకు తన ఆశ్రమమహిమ మీదా ఆ ఆశ్రమప్రాంతానికి వచ్చిన ఒక మహానుభావుని మీదా ఎంతటి విశ్వాసం కలిగితే నిర్భయంగా అక్కడ నిలిచిపోయిందో కదా! ఆ విశ్వాసాన్ని దుష్యంతుడు మాత్రం ఎందుకు చెరుపుతాడు ?

(2) అభిలషింపఁగ నేరఁ డన్యవనిత.

దుష్యంతుడు ధీరోదాత్తుడైన ధర్మప్రభువు. కాళిదాసు చెప్పినట్లుగా ఆశ్రమ పుదు (శాంత మిద మాశ్రమపదం). అటువంటివాడు అన్యవనితల నెట్లా అభిల షిస్తాడు ? తనకు అర్హులైన వారినే తప్ప ఇతరులను అభిలషించడని తాత్పర్యం. తనకు అర్హు లెవ్వరు ?

దుష్యంతుడు కణ్వాశ్రమం సేవించుకోవటానికి ముందుకు సాగుతాడు. ఒక వైపు యజ్ఞధూమాలు, మరోవైపు సాత్త్విక ప్రవృత్తితో మెలగే విరోధిమృగాలు. వేదాలు చదివే చిలుక లొకవంక, సామాలు పాడే తుమ్మెద లింకొకవంక చూస్తాడు. అనసూయా ప్రియంవదలతో కూడి చెట్లకు నీళ్ళుపోస్తున్న 'విపుల లావణ్య పరసీమ' శకుంతల అందచందాలు చూచి తనమనస్సులో ఈ విధంగా అనుకుంటాడు.

సీ॥ సురకన్య కాఁబోలు సురకన్య యయ్యేనే ధీవిమై తెప్పలాడించు టెట్లు
పుత్తడి కాబోఁలుఁ బుత్తడి యయ్యేనే హంసీగతుల నడయాడు టెట్లు ?
వనలక్ష్మి కాఁబోలు వనలక్ష్మియయ్యేనేఁ గటి వల్కలంబులు గట్టు టెట్లు ?
రతిదేవి కాఁబోలు రతిదేవి యయ్యేనే వలరాజుఁ బెడఁబాసి వచ్చుటెట్లు?

తే॥ కన్నుగవ యార్చుటను సుకన్యకాదు
నడచియాడెడుఁ గానఁ బుత్తడియుఁగాదు
లలిఁ దపశ్చిహ్నమున వనలక్ష్మి కాదు
ప్రసవశరముక్తయైనది రతియుఁ గాదు. (2-56)

వ॥ మానవ మానవతియ కావలయుఁగాక దేవకామిని యయ్యేనేని నన్నునవలోకించి యంతర్ధానంబునొందుఁ, గాకుండెనేని యన్యోన్య సల్లాపంబు లుజ్జగించి యూర కుందురు గావున నొక్కదిక్కున మఱుగుపడి యుండి యవలోకింప వలయు నని సమీపవట విటపి మూలంబునం దాగి కనుంగొనుచుండె నయ్యవసరంబున.

అనసూయా ప్రియంవదా శకుంతలలు ముగ్గురూ అహమహమికతో చెట్లకు నీళ్ళు పోస్తుంటారు. ఆ ముగ్గురిలో శకుంతల "లలిత పుష్పిత జంగమ లతికవోలె" ఉండికూడా చెట్లకు నీళ్ళు పోస్తున్నది. అంతటి కోమలాంగితో మోటుపని చేయిస్తున్నా రేమిటా ఈ కరుణలేని మునీశ్వరుడు అనుకొని ఆమె అందచందాలను ఈ విధంగా వర్ణించుకుంటాడు.

గీ॥ చందనంబునఁ బుష్పంబు గుందనమునఁ
బరిమళం బిక్షులతికను ఫలమువోలె
రతిమనోహరమైన యీ యతివమేన
నరయఁ గనుగొంటిఁగాదె యీ యౌవనంబు. (2-62)

వ॥ ఈ లతాతన్వి తపస్వినీ చిహ్నంబులు పూనియున్నను నెరవుదోఁచుచు శరీర కాంతి సౌందర్య సౌభాగ్యంబువలన రాజసంబును, ప్రతాపంబును, గర్వంబును తేవయు, నించుకించుక ప్రకాశించుచున్నయవి, మౌనికన్యాకలితంబగు బ్రహ్మతేజోవిశేషంబు లేశంబును గానరాకున్నయది అది యట్లుండె. (2-63)

ఉ॥ సందియమేల యీ వికచసారసలోచన రాజపుత్రి నా
డెందము మౌనికన్యలఁబడిం జననేరదు నిక్కువంబ యే
చందమునందు సంశయవిచారపదంబగు నట్టి వస్తు సీ
మం దమచిత్తవృత్తులు ప్రమాణము లుత్తములైన వారికిన్ (2-64)

ఉ॥ పౌరవవంశసంభవుల పావనచిత్త విధంబు లన్యకాం
తారతిం బ్రమోదకలితంబులు గావు ప్రకంపమొందిన యీ
ధారుణి సంచలించినను దామరచూలివరంబు దప్పినన్
వారిధు లింకినన్ మఱి దివాకర చంద్రులు తప్పఁ గ్రుంకినన్ (2-65)

అటు తరువాతి కథలో మునికుమారుడు చెప్పిన శకుంతలా జన్మవృత్తాంత కథనంతో ఆమె క్షత్ర పరిగ్రహయోగ్యయైనదే అనీ తేలుతుంది. అన్యవనితలను

దుష్యంతుడు ఒల్లడనేదానికి మరో నిదర్శనం కూడా ఈ కావ్యాంతాన ఉన్నది. దుర్వాసశాపకారణంగా శకుంతలను మరచిపోయి దుష్యంతుడు తన రాజకార్యాల్లో మునిగిపోతాడు. కణ్వుడు పుత్రసమేతంగా శకుంతలను అనసూయా ప్రియంవదల తోడిచ్చి హస్తినాపురం పంపుతాడు. అనసూయా ప్రియంవదలు కణ్వ సందేశం వినిపించి భార్యా పుత్రులను స్వీకరించుమంటారు. శాపం మూలంగా శకుంతలను తనభార్య అని మరచిపోయిన దుష్యంతుడు కణ్వమునీంద్రుని ఆదేశం విని కూడా పరకాంతాసంగమం ఈ విధంగా అసహ్యించు కొంటాడు.

గీ॥ అనిన నమ్మాటలకు నసహ్యంబు నొంది
యొఱఁగుపై నున్నవాఁడు బెట్టులికి లేచి
కర్ణములు మూసికొని శిరఃకంప మొదవఁ
దొలుత హరహరహర యంచుఁ బలికి పలికి (4-113)

క॥ మునికన్యక యఁట ! నేనఁట!
వనమున గాంధర్వమున వివాహంబఁట! సూ
నుని గనెనఁట! మఱచితినఁట !
వినఁగూడునె యిట్టిభంగి విపరీతోక్తుల్, (4-114)

ఉ॥ కాయజవైరి సన్నిభుఁడు కాశ్యపుఁ డాతని పుత్రి నిచ్చ నేఁ
జేయుట యెట్టు? కార్యఫలసిద్ధి వహించుట యెట్టు? భస్మముం
జేయఁడె చంద్రమఃకులము చిన్నగుసన్నను? వింత యెంత య
న్యాయపుమాట ! తీఁటగొనినం గొఱవిం దల గోకికొందురే?

గీ॥ చదువనే మున్ను ధర్మశాస్త్రంబు? లన్య
కామినీరతి కలుషంబుగా నెఱఁగనె?
యన్యసతిమాత్రమే? కాశ్యపాత్మజాత
యరయనంగార కల్పితయైన ప్రతిమ. (4-116)

సీ॥ గజరాజగామిని కంఠసూత్రంబులు కాలసూత్రంబులుగాఁ దలఁపక
పద్మపత్రేక్షణ బాహుపాశంబులు కాలపాశంబులుగాఁ దలఁపక
కోమలి పీనవక్షోజ చక్రంబులు కాలచక్రంబులుగాఁ దలఁపక
యుడురాజ వదన మృదూరు దండంబులు కాలదండంబులుగాఁ దలఁపక

తే॥ కాలసూత్రంబు లెబ్బంగిఁ గడచు నరుఁడు
కాలపాశంబు లేభంగిఁ గడచు నరుఁడు
కాలచక్రంబు లేభంగిఁ గడచు నరుఁడు
కాలదండంబు లెబ్బంగిఁ గడచు నరుఁడు. (4-117)

వ॥ నా హృదయంబు పరవధూ సుఖంబునకు విముఖంబుగాని సుముఖంబుగాదు మీర లెచ్చటినుండి విచ్చేసితిరో యచ్చటికి నరుగుండు. మీకు నిదె సేవాంజలి."
..................................(4-118)

కణ్వమునీంద్రుని ఆదేశం కూడ కాదన్న దుష్యంతుని అన్యవనితాసంగమ వైముఖ్యం ఎంత ఉదాత్తమైనదో పైపద్యాలు సంఘటనలు సాక్ష్యం చెప్పుతున్నవి.

(8) నిందింపనేరఁడు నీచ శత్రుగణంబు.

దుష్యంతుడు ధీరోదాత్తుడు కనుక అనుచితమైన నిందాలాపాలు తన శత్రువుల యెడకూడా చేయడని తాత్పర్యం. కావ్యంలో దుష్యంతునికి రెండు మూడు సందర్భాలలో శత్రువులు తారసిల్లుతారు. ఒక్కచోట కూడ తన ఉదాత్తచరిత్రకు భంగం కలిగే విధంగా వారిని నిందించడు. ఈ కావ్యంలో దుష్యంతునికి మొదట తారసిల్లిన శత్రువు తుమ్మెద. రెండవ ఆశ్వాసంలో శకుంతల అనసూయా ప్రియంవదలతో మాట్లాడుతుండగా దుష్యంతుడు చాటునఉండి వింటున్నాడు. అప్పుడొక తుమ్మెద శకుంతలా ముఖాంబుజాన ముసురుకుంటుంది. శకుంతల విరవాదికి నీరు పోస్తుండగా ఆమె ఆననగంధం ఆస్వాదించటానికి వచ్చిన తుమ్మెద అది. శకుంతల ఎంత జోపినా ఆ తుమ్మెదపోదు. ఆమెను బాధపెడుతూనే ఉంటుంది. తాను ప్రేమించిన శకుంతల ముఖాన్ని అక్షులనూ అధరాన్ని ఆస్వాదించటానికై బాధపెట్టే ఈ తుమ్మెద దుష్యంతునికి శత్రువే కదా! ఆ తుమ్మెదను దుష్యంతుడు నిందించడు సరికదా ఇట్లా అంటాడు.

మ॥ వనితం జంచదపాంగఁ జేసి కనుఁగ్రేవల్ ముట్టుచుంజేరి మం
తనముం జెప్పెడు భంగి నొయ్యఁ జెవి చెంతన్ మ్రోయుచున్ మెల్లమె
ల్లన మోవిన్ రతిసౌఖ్యసంపదలఁ గొల్లల్ గొంటి ధన్యుండ వీ
వనఘా! తుమ్మెద! నేను వెల్వడితిఁ దత్త్వాన్వేషముం జేయుచున్.

ఎంత ఉదాత్తులకో కాని శత్రువులయెడ ఇట్టి అనుగ్రహం చూపేశక్తి ఉండదు. ఐనా దుష్యంతుడు నిగ్రహంతో ఆ తుమ్మెదను ఈ విధంగా ఆక్షేపిస్తాడు.

వ॥ విమలసుధాకరకులీనుండ నేను శంకాకలంకితచిత్తుండనై యుండ మలీమస మధుపకులీనుండవీవు నిశ్శంకం గొంకక పంకజముఖిం జవిగొంటివి చండాలి భర్త పుణ్యుండును విశ్వంభరాభర్త యపుణ్యుండును నయ్యెంగదా। (2-78)

స్వచ్ఛమైన చంద్రవంశంలో పుట్టినతానేమో ఆమె క్షత్ర పరిగ్రహయోగ్య ఔనో కాదో అని శంకతో ఉంటే తాగుబోతుల కులంలో పుట్టిన తుమ్మెదేమో ఏశంక లేకుండా ఆమెను అనుభవించినదనే ఆక్షేపణ. చండాలిభర్త అనే మాటలో శ్లేష ఉంది పైకి అది కలిపి పలికితే నిందాత్మకంగా వినబడినా విరిచి చండ + అలిభర్త అని పలికితే చండుడైన మగతుమ్మెద అనే అర్థం వస్తుంది. దీనికి చండాలిభర్త అనే పాఠాంతరం కూడా ఉంది. దీని అర్థం గన్నేరుపూవుల్లో రమించే తుమ్మెద అని, విశ్వంభరాభర్తఐన తాను నోచుకోని పుణ్యానికి ఆ తుమ్మెద నోచుకున్నదనే ఆక్షేపం తప్ప ఇందులో నింద ఏమీలేదు.

దుష్యంతునికి మరో శత్రువు మన్మథుడు. దుష్యంతుడు తానెంత బాధకు గురి ఐనా మన్మథుణ్ణి నిందించడు. శకుంతల ముందుగా చంద్రుణ్ణి అటుతరువాత మన్మథుణ్ణి ఈ విధంగా ఉపాలంభిస్తుంది.

సీ॥ వావిఁ దప్పించితి వనజాసనుని యంతవానికిఁ గూఁతురు వలపుఁ గఱపి
దోషంబుగట్టి తిందుని యంతవానికి గురుకళత్రంబుపై మరులు గొలిపి
బలుకోడిఁ జేసితి పాకశాసను నంతవాని నహల్యకై వాసి చెఱచి
నెరసువట్టితి పరాశరు లంతవాని నట్టేటఁ బామరు కన్నెపాటు మఱపి

తే॥ నీ ప్రతాపంబు లెన్ని యెన్నికకు లేవు?
తొడిఁబడితి నాఁటదాన నీతో యమునను
నన్ను మన్నింపు దుష్యంతునకు ఘటింపు
మయ్య వెఱతును మదన జోహారు నీకు (3-190)

చంద్రమన్మథ బాధలు శకుంతలా దుష్యంతులకు ఇద్దరికీ సమానమే. శకుంతల బాధకు తట్టుకోలేక నోరుపారవేసుకుంటుంది. దుష్యంతుడు మాత్రం ఎవరినీ నిందించడు.

దుష్యంతునికి తారసిలిన మూడవ శత్రుగణం రాక్షసులు. శకుంతలను గాంధర్వవిధి ప్రకారంగా అనసూయా ప్రియంవదల సమక్షంలో వివాహం చేసుకొని సుఖపడుదామనుకొనే సమయానికే రాక్షసుల సమరభేరీరావాలు వినిపిస్తవి. అదివిని మునుల ఆర్తారావాలు మిన్నుముట్టుతవి. నూత్నదంపతులు పల్లవతల్పం మీదికి పోదామనుకునే ఈ సంతోషసమయం కర్ణకఠోరమైన పెడబొబ్బలతో పాడైపోతుంది. దుష్యంతుడు మునులను రక్షించటానికి బయలుదేరుతాడు. అప్పటి శకుంతల పరిస్థితి గమనించదగినది.

ఉ॥ తాఁ గదలంగ బాష్పములధారలునుం గదలంగ నింతి దా
నాఁగకయున్న దుఃఖకున మౌనని ఱెప్పల నప్పళింపఁగాఁ
దోఁగిన యశ్రువారిఁ గనుదోయి భరంబయి యొప్పె నెట్టిగాఁ
గ్రాఁగిన సిక్తతోయమగు కాయజుసాయక యుగ్మమో యనన్
(3-99)

ఇటు పెండ్లి చేసికొని వెంటనే అటు యుద్ధానికై తనను విడిచిపెట్టిపోయే దుష్యంతుణ్ణిచూచి అపశకునభయానికి కన్నీళ్ళు కండ్లలోనే ఆపుకుంటుంది. దుష్యంతుడు రాక్షసులతో యుద్ధానికి తలపడుతాడు. రాక్షసనాయకుడు దుష్యంతుణ్ణి ధాత్రీశాధముడని (3-118) తిట్టినా దుష్యంతుడు తన పటిమ చేతల్లో చూపిస్తాడే కాని ఒక్క పొల్లుమాట అనడు. ప్రియాప్రియులు ప్రథమరతికై కలిసికొనేవేళ ఈ దారుణ సంగ్రామం వచ్చిపడ్డందుకు సాధారణు డెవడైనా ఐతే అటు మునులనూ ఇటు రాక్షసులనూ చివరకు తన విధిని నిందించుకొంటాడు. కాని ధీరోదాత్తుడైన దుష్యంతుని నోట ఒక్క నిందావాక్యంకూడ రాదు.

(4) బొంకనేరఁడు హాస్యమునకుఁ బలికి

దుష్యంతుడు నవ్వులాటకైనా అబద్ధమాడడని తాత్పర్యం.

ఇది ధీరోదాత్తుని ముఖ్యలక్షణాల్లో ఒకటి. పుళిందుల ఆహ్వానాన్ని పురస్కరించుకొని దుష్యంతుడు వేటకుపోయి నానా క్రూరజంతువులను, పంటలను, పశువులను నాశనంచేసే అడవిజంతువులను వేటాడుతాడు. ఇంతలో ఒక జింక కనపడితే దాని వెన్నంటి అది ఆశ్రమమృగమని తెలియక తరుముతాడు. ఆ జింక పరుగెత్తి పరుగెత్తి అలిసిపోయి ఆశ్రయసమీపాన ఆగిపోతుంది. అప్పుడొక ముని అది ఆశ్రమ మృగమనీ దాన్ని చంపవద్దనీ వాదిస్తాడు. ముని శపిస్తాడో ఏమో అని దుష్యంతుడు గజగజలాడిపోతాడు వెంటనే ఉన్నమాట చెప్పి క్షమాపణ వేడుకుంటాడు

"...ఇది యాశ్రమమృగంబౌట యెఱుంగక కురంగలించియుండ వన్య మృగంబకా నిర్ణయించి వేటాడి యలయించితి. ఈ యజ్ఞానంబు సహింపవలయు" (2-39) అంటాడు. దుష్యంతుని సత్యసంధతను గ్రహించి ఆ ముని ఈవిధంగా రాజును సాంత్వన పరుస్తాడు.

క॥ జననాథ దుష్టమృగ మ
ర్దన మొనరింపంగ నీ వరణ్యంబునకుం
జనుదెంచు టంతరవలో
కనముల నెఱుఁగుదుము నీకుఁ గలుషము గలదే? (2-40)

గీ॥ దీని నాశ్రమ మృగమని తెలియకీవు
వచ్చుటెఱుఁగుదు మవనీశ! వలదు భయము
వైరిమర్దనుఁడవు వంశవర్ధనుఁడవు
కీర్తిమనుఁడవు నీకొక కీడుగలదే? (2-41)

ఉ॥ సర్వజనైకపూజ్యుఁడవు సత్యయుతుండవు నీవు మామకా
శీర్వచనంబునం గను ప్రసిద్ధు నపూర్వ సుపర్వనాయకాం
తర్వసుఁడైన నీ యనుఁగుఁదాతఁ బూరూరవుఁ బోలువాని నీ
యుర్వరఁజక్రవర్తి పదమొందు సుపుత్రుని సచ్చరిత్రునిన్. (2-42)

ముని దుష్యంతుని సత్యసంధతను చాటటమేకాక పురూరవునివంటి వాణ్ణి చక్రవర్తి అయ్యే కుమారుణ్ణి కనుమని ఆశీర్వదిస్తాడు, ఈ ఆశీర్వచనం కూడ భరతుని జన్మకు సూచకమైనదేకదా!

దుష్యంతుని సత్యసంధతను చాటే మరో సన్నివేశం శకుంతలా సౌందర్యాన్ని చాటున ఉండి చూస్తున్న దుష్యంతుడు భ్రమర బాధను అపనయించటానికై ముని కన్యలయెదుట ప్రత్యక్షమౌతాడు. అతన్ని చూడటంతో శకుంతల మనస్సుకూడా వికారం పొందుతుంది. అత దేవరో తెలిసికోవటానికై అనసూయా ప్రియంవదలు ఇట్లా అడుగుతారు.

ఉ॥ ఎక్కడివాఁడవన్న? జగతీశ్వరలక్షణ లక్షితంబు నీ
చక్కనిమేను, దీర్ఘ భుజశాఖలుఁ దేజముఁ జర్చ సేయఁగా
నిక్కడి కొంటి వచ్చుటకు నెయ్యది కారణ? మంతవట్టు నీ
నిక్కముఁ జెప్పుమన్న ధరణీపతి సత్యచరిత్రుఁ డాత్మలోన్ (2-81)

క॥ వారక యసత్యవచనము
నారకహేతువనఁగను వినంబడెదుం బు
ణ్యారణ్యములోపల ముని
దారికలకు బొంకనేల ధర్మచ్యుతిగన్? (2-32)

వ॥ అనివిచారించి వారలతో నేను దుష్యంతుఁడఁ గాంతారంబున దుష్టమృగం బుల మర్దించుటకై వేఁటవచ్చి మాలినీతీరంబునం బరివారంబు నిలిపి కణ్వమహాముని న్నమస్కరించిపోవుతలంపున వచ్చి యిచ్చట నొక్క కలువకంటి యొంటి నాక్రోశింప మీయార్తనాదంబు విని యరుగుదెంచు నప్పటికి మీ సరస సల్లాపంబులై యున్నయవి" యని యల్లనల్లన శకుంతలం గనుఁగొనుచుండ నచ్చట. (2-33)

అభిజ్ఞానశాకుంతలంలో మీరెవరని అనసూయ అడిగితే దుష్యంతుడు తాను ప్రభువునని చెప్పడు, పౌరధర్మాధికారిననీ తపోవనరక్షణార్థం వచ్చినాననీ చెప్తాడు. కాని ఈ కావ్యంలో దుష్యంతుడు నవ్వులాటకు కూడా బొంకనివాడు కనుక ఉన్న సత్యం చెప్తాడు.

నర్మసఖుడైన మాండవ్యునితోగూడ-

గీ॥ ప్రాణసఖుఁడవు నీకుఁజెప్పక మదీయ
వృత్తగోపన మెట్లు గావింవనేర్తు?
మచ్చనాలుకవాఁడవు మంతనంబుఁ
బొడమ నీకని రసనకు బుద్ధిచెప్పు" (2-172) అని

హెచ్చరించి శకుంతల అందచందాలు విపులంగా వర్ణించి తానామెను ప్రేమించి నట్లుగా సత్యమే ప్రకటిస్తాడు. అభిజ్ఞానశాకుంతలంలో విదూషకుణ్ణి రాజధానికి పంపిస్తూ దుష్యంతుడు ఇదంతా బల్లెక్కం అంటాడు.

అనసూయా ప్రియంవదలు దుష్యంతుని గాంధర్వవివాహానికి శకుంతలకు పుట్టబోయే పుత్రునికే యౌవరాజ్యాభిషేకం చేయవలెనని ఒక షరతు పెడుతారు. దుష్యంతుడు దానికి అంగీకరించి శపథం చేయటమేకాక కావ్యాంతంలో భరతునికి యౌవరాజ్యపట్టంకట్టి మాట నిలబెట్టుకుంటాడు.

(5) విడువనేరఁడు చెడ్డవిటునిఁ జేపట్టిన.

దుష్యంతుడు ఆశ్రిత పక్షపాతి. ఇక్కడ విటశబ్దం జారుడనే సంకుచితార్థంలో కాక విదూషకుడనే అర్థంలో గ్రహించాలె. చేపట్టిన ఎటువంటివాణ్ణైనా విడిచి పెట్టడని దీని తాత్పర్యం. దుష్యంతుడు వేటకు పోతుంటే నర్మసచివుడైన మాండవ్యుడు కూడ వెంట బయలుదేరుతాడు.

ప్రథమాశ్వాసంలో గొల్లలిచ్చిన ఆతిథ్యంలో ఈ విదూషకుడు సంపూర్ణ భాగస్వామి. కాని ద్వితీయాశ్వాసంలో రాజుగారి ఆఖేటం చూచి భయపడిపోతాడు. ఎట్లాగైనా తానొక్కడైనా వెనుదిరిగి పోవటానికి ఉపాయం ఆలోచిస్తాడు. నీ వేట విజయంకోసం జపతపాలు చేస్తాను నన్ను తిరిగి పంపించుమని రాజును వేడుకొంటాడు. విరికి బ్రాహ్మడి భయం పసికట్టినాడు దుష్యంతుడు.

క॥ అనుటయు మాండవ్యుని మన
మునఁ గలిగిన భీతిఁ దెలిసి భూపాలకుఁ డి
ట్లను "బ్రాహ్మణః మిత్రునిఁ బా
యని నే నిన్నకట యేమఱుదునే యిచటన్? (2-12)

వ॥ నీవు నావెంట నంటుకొని యొంటివడక తోడునీడయుంబోలె నేతెమ్ము. ప్రమాదంబుగాకుండఁ బ్రమోదంబుగా వేఁటవేడుకం జూపెద. కుసుమంబునుం బోలెఁ గందకుండ నిన్నుఁదెచ్చెద..." (2-13)

అని అభయం ఇస్తాడు.

(6) కడపనేరం డర్థిగణము వాంఛ.

దుష్యంతుడు అర్థిజనమందారం. ఇతిహాసంలోను నాటకంలోను దుష్యంతుడు తన వినోదంకోసం వేటకు బయలుదేరుతాడేకాని శాకుంతల కావ్యంలో పుళిందులువచ్చి తమ కష్టనష్టాలు చెప్పుకొని వేటకు రావలసిందిగా అర్థిస్తే వారికోరిక తీర్చటానికై పోతారు కణ్వాశ్రమంలోని మునులు,

మ॥ అతిరాత్రంబను పేరిటన్ మఖము సేయంబూని కణ్వాశ్రమం
బుతపస్వుల్ భవదంతికంబునకు మమ్ముంబెట్టి పుత్తేర వ
చ్చితి మిచ్చోటికి నుల్లసద్విజయలక్ష్మీశాలి వచ్చోటికిం
గ్రతుసంరక్ష యొనర్ప రావలయు నక్షత్రేశవంశాగ్రణీ (3-8)

అని అభ్యర్థిస్తే వారికోరికగూడ తీరుస్తాడు.

శకుంతలా దుష్యంతుల గాంధర్వవివాహానికిముందు అనసూయాప్రియం వదలు,

ఉ॥ మా తరలాక్షిపైఁ గలుగు మక్కువ నిక్కువమయ్యెనేని యో
భూతలనాథ యీతలిరుఁ బోడికి నీకునుఁ బుట్టుపుత్రుఁ బ
స్ఫీతిగ యౌవరాజ్యపదపీఠమున న్నిలుపంగ సత్కృపా
న్వితుఁడవై మనోజ్ఞమహనీయముగా శపథంబు సేఁదగున్ (8-99)

అని కోరితే అదేవిధంగా శపథంచేసి కావ్యాంతాన ఆ శపథం చెల్లిస్తాడు.

(7) అడుగుపెట్టఁగ నేరఁ డపయశంబగు త్రోవ.

అపకీర్తికి దారితీసే ఏపనికూడ దుష్యంతుడు చేయడని తాత్పర్యం. ముని కన్యమీద తన మనస్సెందుకు పారిందా అని శంకించినవాడు. ఆమె క్షత్రపరిగ్రహయోగ్య అని తేల్చుకొన్న తరువాత, తానా ప్రాంతానికి ప్రభువుకనుక ఆమెను తన యిష్టంవచ్చినట్టు కోరవచ్చుగదా! బలవంతులైన వారెందరు అటువంటి బలాత్కార వివాహాలు చేసుకోలేదు? అటువంటి అపమార్గం దుష్యంతునికి ఇష్టమైనదికాదు. తానైతే ఆమెను ప్రేమించినాడుగాని ఆమె తనను ప్రేమిస్తుందోలేదో? ఒకవేళ కణ్వమునీంద్రుడు ఇదివరకే ఆమెను ఎవరికైనా ఇస్తానని నిశ్చయించుకున్నాడో యేమో! అప్పుడు తన కోరిక తీరేదెట్లా? అని డోలాందోళితమనస్కుడౌతాడు.

గీ॥ కన్య క్షత్రియవీర్య యోగ్యఁగాక యేమి!
కణ్వుఁ డొకని నీఁ గడకట్టెనేని
చెలువ నామీఁదఁ గూరిమిసేయదేని
రెంట దుష్యంతు కోర్కె పూరించుటెట్లు? (2-157)

చ॥ గొనకొని తావిమూర్కొనని క్రొవ్విరి యెయ్యెడ వజ్రసూచి రా
యని రతనంబు జిహ్వచవియానని తేనియ గోరుమోవి గి
ల్లని చిగురాకు లాలితవిలాస నికేతన మాలతాంగి దా
ననుభవకర్త యేఘనుఁడో యావిధియత్న మెఱుంగ నయ్యెడున్
(2-158)

ఈ రెంటిలో ఏ ఆటంకం కలిగినా తాను అపకీర్తి పాలౌతాడు కదా! అందుకే ఆ రెండు శంకలూ తీర్చుకున్న తరువాతనే శకుంతలను గాంధర్వవిధిగా వివాహం చేసుకుంటాడు.

ఇంకొక ఉదాహరణం. కణ్వుడు శకుంతలను భరతుణ్ణి కొంత పరివారంతో హస్తినకు పంపిస్తాడు, వాళ్ళు రాజమందిరద్వారం చేరుకుంటారు. అప్పుడొక పణిహారి దుష్యంతుని సన్నిధికివచ్చి "కణ్వాశ్రమంబుననుండి యిద్దరు తపస్వులుఁ గతిపయ తపస్వినీజనంబును దేవరకుం బొడసూపనని వచ్చినవాకిట నున్నవారని విన్నవించిన నన్నరనాథులందు మునినాథుం డిట్లు పుత్తెంచుటకు నెయ్యది కతం బొకో యని విస్మయభయంబులు మనంబునం బెనంగొనంగ సభాస్థలంబుల స్త్రీజనులం బొడ సూపించుకొనుట యనర్హంబని, యందఱ వీడుకొలిపి, నగరిలోనికింజని, యంతః పురాంతికంబున నేకాంతసౌధంబున నాసీనుండై, మాన్యలగు వృద్ధకాంతలం బనిచి వారల రప్పించి, యుచితసత్కారంబు లొనర్పం బ్రీతులై పురోభాగంబునఁ గాశ్యప శిష్యులు, వారివెనుక సంయమి రాజుకాంతలు, వారి మఱుంగునం గుమారయుక్తయై శకుంతలయు నిలిచియుండి రయ్యెడ నాసంయమి శిష్యులు దుష్యంతు నాశీర్వదించి" (4-100)

కణ్వసందేశం వినిపించి శకుంతలను పరిగ్రహించుమంటారు. శాపంమూలంగా మరచిపోయిన దుష్యంతుడు శకుంతలను స్వీకరించ నిరాకరిస్తాడు. వాళ్ళుగట్టిగా మందలిస్తారు, గర్హిస్తారు. అప్పుడాతడు "మీర లాఁడువారలు మీతోడ నిట్టిట్టయనుట యుక్తంబుగాదు, ఆశ్రంబునకు నేఁడు, రేపట, యెల్లి, యెల్లుంటవచ్చి కణ్వమహా మునీంద్రుంగని తదాదిష్టమార్గంబున నడచెదంగాక పొండ"ని (4-124) లేచిపోతాడు. ఈ రెండు సందర్భాల్లో కూడ దుష్యంతుడు తనకు అపకీర్తికరం కానట్టిదీ, ఉచితమైనట్టిదీ ఐన. మార్గాన్నే అనుసరించినాడు.

ఆకాశవాణి సత్యప్రకటనం తరువాత, అంగుళీయకం చూచిన తరువాత శాపం విడిపోయి దుష్యంతునికి తన పొరపాటు తెలుస్తుంది. అప్పు డాతడు పడ్డబాధ ఇంతంత కాదు.

గీ|| కొడుకు నాయంతవాఁడయ్యెఁ గడు నెదిగెను
దేహమాత్రంబె చిక్కె గాధేయతనయ
తలఁపు లేకింత కాలంబు తడయు టెట్టు?
తెలవ కిచ్చిన సత్యంబు మఱచు టెట్టు? (4-135)

సీ|| గణనాధికముగ యాగములు గావించినఁ బాయునే యీమహాపాతకంబు?
చతురబ్ధి మధ్య భూస్థలి దాన మిచ్చినఁ గడచునే యిమ్మహాకల్మషంబు?

సప్తముక్తి ప్రదేశములు దర్శించినఁ దొలఁగునే యిమ్మహాదుష్కృతంబు
కర్మహారేశ్వరాగ్రం బెక్కి-పడినను గెడయునే యిమ్మహాకిల్బిషంబు ?

తే॥ ధర్మపథవర్తు లిట నన్నుఁ దలఁచి నపుడు
కర్ణములు మూసికొని యెడఁ గలిగి చనరె?
పలుకులేల యసత్యవాదులకు నెల్లఁ
నుర్విపై నేన యగ్రగణ్యుండ నైతి (4-186)

అపయశస్సంటే పూర్వకాలపు ధర్మప్రభువులకు ఎంత ప్రాణాంతకమైన వేదనో పై పద్యాల వలన తెలుస్తుంది

8) చనఁగ నేరం డార్తజనము విడిచి.

దుష్యంతుడు ఆర్తత్రాణపరాయణు డన్నమాట. ఆర్తులై వారి నెప్పుడూ ఆతడు విడిచిపెట్టి పోడు. ఆతని ఆర్తత్రాణ పరాయణత్వానికి ఈ కావ్యంలో రెండుమూడు ఉదాహరణ లున్నవి.

అందులో మొదటిది. శకుంతల తుమ్మెద బాధపడలేక తన చెలికత్తెలతో ఈ విధంగా మొరపెట్టుకుంటుంది.

గీ॥ ఏను మీచెలి నింతేల యెరవుసేయ
వింతవారైన మొఱ యాలకింతు రకట
ప్రాణసములను కావరే! ప్రాణమిచ్చి
మమత విడువక మాన్పరే! మధుప బాధ (2-74)

గీ॥ వివర మొనరింప బొందులు వేఱు గాని
ప్రాణ మొక్కటి మనకుఁ బద్మాక్షులార!
పాపరే నాకు నీ యీతిబాధ" యనినఁ
జిట్టకాలకు వార లచ్చెలువతోడ (2-76)

పెరవారైనా నామొరవింటారు. మీరైతే ప్రాణసఖులు ఈ ఆర్తినుండి నన్ను కాపాడండి అని శకుంతల మొరపెట్టుకుంటే అనసూయా ప్రియంవదలు ఈ విధంగా అంటారు.

ఉ॥ ఇంతి తపస్వికన్యకల మే మసమర్థుల మీతిబాధ భూ
కాంతుఁడు మాన్పు ధాత్రిప్రజఁ గావను ద్రోవనుగ్ర కాన దు
ష్యంతుఁడు కేము చెప్పెదము సాధుజనార్తి హరుం డతండు దు
ర్దాంతుని నియ్యళిం గెడపి తామరపూ చెఱసాలఁ బెట్టెడున్. (2-77)

ఈతిబాధలు తొలగించే బాధ్యత రాజుది. దుష్యంతుడు సాధుజనార్తి హరుడు. అందుకే అతడీ ఆర్తురాలిని తుమ్మెదబారినుండి రక్షిస్తాడు.

రెండవ ఉదాహరణ. పై ముగ్గురు ఆశ్రమకన్యలకు దుష్యంతుని పరిచయమైన తరువాత వాళ్ళు మహారాజుకు ఆతిథ్యం ఏర్పాటు చేయటానికై పర్ణశాలకు పోయి అతిథిని తీసుకరావటానికై ఒక మునిశిష్యుణ్ణి పంపుతారు. మునిశిష్యుడు వచ్చి దుష్యంతుణ్ణి ఆహ్వానిస్తాడు. దుష్యంతు డాతనితో ముందుగా ఈ శకుంతల వృత్తాంతం చెప్పి అటు తరువాత వస్తానంటాడు. మునిశిష్యుడు శకుంతల జన్మవృత్తాంతం సవిస్తరంగా వినిపిస్తాడు. దుష్యంతు డప్పుడాతని వెంట బయలుదేరుతాడు. ఇంతలో హఠాత్తుగా గాండ్రించుకుంటూ ఒక పెద్దపులి వస్తుంది. కణ్వాశ్రమంలో వైరిమృగాలు క్రూరసత్వాలు కూడ ప్రశాంతంగా ఉండటం చూచిన మునిశిష్యునికి ఈ భీషణ గర్జనలూ ఆభీకరమైన ఆకారమూ చూడగానే భయంకలుగుతుంది. అతడు కుయ్యో మొఱ్ఱో అంటాడు.

శా॥ ఆశార్దూలముఁ జూచి భీతహృదయుండై మేను కంపింపఁగా
నాశల్ చూచుచు బ్రాహ్మణుం డపుడు ప్రాయః ప్రాణరక్షార్థమై
యోశార్దూల మృగేంద్ర చర్మధరః యోయుగ్రాక్షః యోయద్రిజా
ధీశాః యీ యపమృత్యువుం గడపరావే యంచుఁ గీర్తింపఁగన్.

(2-154)

ఇందాక తుమ్మెద బారినుండి తనను రక్షించుమని శకుంతల ఎదుట ఉన్న అసమర్థలైన సఖులను పిలిస్తే ఎదుటలేని దుష్యంతుడు వచ్చి రక్షిస్తాడు కదా! ఇప్పుడీ పిచ్చి బ్రాహ్మణుడు ఎదుటలేని శివుణ్ణి ప్రార్థిస్తే ఎదుట ఉన్న సమర్థుడైన రాజు ఊరకుంటాడా?

వ॥ అవిప్రవరుని యార్తియు, నిర్దయశార్దూల విస్ఫూర్తియుం గనుంగొని కారుణ్యమూర్తియగు నారాజు భీతచేతస్కుండైన వాని నుపచరించుచు శీఘ్రగమనంబున వచ్చు వ్యాఘ్రంబును" (2-154) అడ్డగించి అతని ఆర్తిని తొలగిస్తాడు. (ఈ కల్పన అంతా పినవీరనగారి సొంతం. శార్దూలపుభయాన్ని శార్దూలంలో వర్ణించటం వృత్తౌచిత్యం. మునిశిష్యుడు శివుణ్ణి సంబోధించిన పద్ధతి కూడా సాభిప్రాయంగా ఉంది.)

మూడవ ఉదాహరణం. రాక్షసులు సమరభేరి మ్రోగించటంతో మునులు భయపడి ఆర్తారావాలు చేస్తారు.

గీ॥ పిశితభోక్తల నిష్ఠురభేరిరవము
నధికభీతమునీంద్రుల యార్తరవముఁ
గోపకారుణ్య రసములు గుదిగొనంగ
నపరరావంబు భూవిభుఁ డాదరించి. (3-96)

రాక్షసుల భేరీరవంకంటె మునుల ఆర్తరవం దుష్యంతుణి ఆకర్షిస్తుంది. దానికి కారణం?

సీ॥ సౌధాగ్రరత్న పంజరముల రంజిల్లు రాజకీరమనోజ్ఞ రవముకంటె
భోగినీ నఖరాగ్రముల మోహనంబైన వలమాన వీణారవంబుకంటెఁ
గలకంఠకంతులు కులరవంబులు గొల్పు రమణీయ సంగీతరవముకంటెఁ
జామరగ్రాహిణీజనముల కరరత్న వలయమంజీర రావంబుకంటె

తే॥ మంది రోద్యాన కాసారమధుప చక్ర
వాక కలహంస మధురరవంబు కంటె
నుత్తమ క్షత్ర కులజులు చిత్తగించి
యాదరింతురు కరుణతో నార్తరవము. (3-97)

దుష్యంతుడు మునులను వారి ఆర్తినుండి కాపాడటానికి యుద్ధసన్నద్ధు డౌతాడు. అప్పుడే వివాహమైన శకుంతలను విడిచిపెట్టి పోయి రాక్షసులతో యుద్ధంచేసి వాళ్ళను చంపి మునుల యజ్ఞం కాపాడుతాడు.

(9) ఐదు పదిసేయ నేరఁ డాహవముఖమున.

యుద్ధంలో దుష్యంతు డెవరికీ చేతులు జోడించడని అర్థం. ధీరోదాత్తుని కుండే శూరత్వమహాసత్త్వత్వ లక్షణాలు ఇందులో సూచితం. కావ్యప్రారంభంలో దుష్యంతుని వర్ణించిన పద్యాలన్నీ ఈ లక్షణాలకు ఉదాహరణంగా తీసుకోవచ్చు. తృతీయాశ్వాసంలో కణ్వాశ్రమమునులు నిర్వహించే అతిరాత్రయజ్ఞాన్ని ధ్వంసం చేయటానికి వచ్చిన అసంఖ్యాకరాక్షసులను దుష్యంతుడు ఏకధనుర్ధరుడై నిర్జించిన ఘట్టం దీనికి సాక్ష్యం.

10) క్రించు నందును నేరఁడు కీడొనర్ప.

దుష్యంతుడు అల్పులైనవారికి బలహీనులైనవారికి కీడుచేయడని తాత్పర్యం. సాధారణంగా బలవంతులు తమకంటె బలంతక్కువ వాళ్ళను అణచటం, తమకంటె

ఎక్కువ బలవంతుల ముందు మోకరిల్లటం మనం చూస్తుంటాము. కాని దుష్యంతుడు ధీరోదాత్తుడైన ధర్మప్రభువు కనుక ఎంతటి అల్పునికైనా కీడు చేయడు. దీనికి ఒకటి రెండు ఉదాహరణలు:

దుష్యంతుడు సపరివారంగా వేటరులతో ఆఖేటానికి అడవులకు పోతాడు. మార్గమధ్యంలో ఒక గొల్లపల్లెలో అతనికి స్వాగతం లభిస్తుంది. ఆ ఊరి గొల్లలు ఒక పూట తమ ఆతిథ్యం స్వీకరించవలసిందిగా ప్రార్థిస్తారు. రాజుగారు అంగీకరిస్తారో లేదో అని శంకించే భోజనప్రియుడైన మాండవ్యుడు మధ్యన కల్పించుకొని ఇట్లా అంటాడు.

ఉ॥ ఒల్లమిచేసి వీరలకు నుత్తరమీకు నృపాల, పెర్వులుం
జల్లలు నమ్ముకొన్నయవి చాలఁగనున్నవి, చిత్రధాన్యముల్
కొల్లలు త్రవ్వితండములు, కుప్పలు, నేతులు, పాలు, వెన్నలుం
గొల్లల కేమి మూఁడె మనకున్ మఱి కూడొకపూట వెట్టినన్.(1-125)

క॥ కానుక కప్పము వెట్టరు
మానము తప్పఁ దిని క్రొవ్వి మనుబోతుల సం
తానమువలె నున్నారీ
కాననమున రాచసొమ్ము గతముగఁ గొనుచున్. (1-126)

ఆ గొల్లలు రాజుగారికి కప్పం చెల్లించకపోయినా, కానుక లీయకపోయినా, మానము తప్పదిన్నా, రాచ సొమ్ము గతముగ గొన్నా, అటువంటి కించులైనా దుష్యంతుడు వారికేమీ కీడు చేయడు.

అనసూయా ప్రియంవదలు శకుంతలను అప్పగించటానికి వచ్చినప్పుడు దుష్యంతు డామెను నిరాకరిస్తే అంతటి చక్రవర్తిని అతని ఇంట్లోనే నానా మాట లంటారు.

శా॥ మత్తుల్ క్రూరమతుల్ నవప్రియులుఁ గామధ్వాంతకారుల్ మృషా
విత్తుల్ మత్యసమస్వభావులు శఠుల్ విశ్వాసహీనుల్ చల
చ్చిత్తుల్ దూరపదార్థకాంక్షులు బహుస్త్రీలోలుపుల్ ప్రేరకా
యత్తుల్ రాజు లనంగ విందు మది సత్యం బయ్యె నీపట్టునన్.(4-120)

అంతేకాదు. శకుంతల వ్రేలికిఉన్న అభిజ్ఞానాంగుళీయకం తీసి అతని ముఖానకొట్టి దుర్భాషలాడుతారు.

ఉ॥ ఆపలుకుల్ వెసన్ వినుచు నా(గహవృత్తి శకుంతలాంగుళి
స్థాపితమైన యుంగరముఁ జయ్యన నూడిచి మీఁదవైచి యో
పాపపురాజు! యెట్లిదియు బాలిక (వేలికివచ్చెఁ జెప్పుమా!
యీ (ప్రజలేగతిం బనిచి రేఁగెదమాగతి నన్న నయ్యెడన్. (4-128)

తన మందిరంలో అడవులనుంచి వచ్చిన అబలలు ఈవిధంగా (ప్రవర్తించినా వారికేమీ కీడుసేయని ఉదాత్తచరి(త్రుడు దుష్యంతుడు,

పినవీరన ఈవిధంగా దుష్యంతుని పదిగుణాలను నేరాలని చెప్పి ఆయా గుణాలు కావ్యమంతటా ఎట్లా వ్యాపించి ఉన్నదీ ఆ ఒక్క పద్యంలో సూచిస్తాడు. (ప్రాచీనకవుల వ్యంగ్యమర్యాదలు కథా కథనమూ సూచ్యార్థ సూచనలు ఈవిధంగా అధ్యయనం చేసినప్పుడే మనం వారికి న్యాయం చేసిన వారమౌతాము.

ఇక ఈకావ్యంలో ఉన్న మనోహరవర్ణనలూ చమత్కారాలూ కొన్ని స్థాలీపులా కన్యాయంగా చిత్తగించవలసిందిగా కోరుతున్నాను.

దుష్యంతుని వేటలో వెంటబయలుదేరిన వేటకుక్కల పేర్లు (1-108) చాలా చి(త్రంగా ఉన్నవి. తరువాతి కాలాన పెద్దనగారికి ఇవి అనుసరణీయాలైనవి. గొల్ల పల్లెలోని విందులు (1-185) మనకు నోరూరింపజేస్తవి. అందులో (శ్రీనాథుని భోజ్య పదార్థముల వర్ణనం తొంగి చూస్తుంది.

విశ్వామి(త్రుని తపస్సు భంగంచేయటానికై మేనకాదులు రావటంతో వసంతో దయం ఔతుంది. ఆ సందర్భాన వీచిన మలయవాయువుల (శ్రీనాథుని చేసన్నతో బయలుదేరినవే. వాటి పోకడలు చూడండి.

సీ॥ సమవర్తి రాణివాసాల పాలిండ్లపై మృగమదామోదంబు మేఁతవట్టి
దర్వీకర స్త్రీలు తన్నువాచవి చూడ గందంపుఁగొండ చెంగట సుఖించి
దర్థురశైల మధ్యమునఁ గర్పూరంపుఁ దరువాటికలలోనఁ దెరువుదప్పి
తా(మపర్ణీఖ్యాతిఁ దనరారు ముత్యాలయేటి యంబువులలో నీఁదులాడి

తే॥ విరహిజనముల హృదయకోటరములందు
రాఁజు మదనానలము మించ రవులుకొల్పి
గాధిపు(త్రుండు దపమున్న కాననమున
నల్లనల్లన వీచె మందానిలుండు. (2-182)

శకుంతల ముక్కును నాగలితో పోల్చటం కొత్తగా ఉంది.

తే॥ జవ్వనంబను తొలుకారు నివ్వటిల్ల
సావితోడను మోహబీజంబు లలుక
మానస క్షేత్రములు దున్నుమదనుఁ డనెడు
కర్షకున కింతి నాసిక కనకహలము. (2-178)

సూర్యాస్తమయం చంద్రోదయం లేదా చంద్రాస్తమయం సూర్యోదయం ఒక్కసారే జరిగినప్పుడు వర్ణించిన పద్యాలు మాఘుని నాటినుండి చూస్తాం కాని ఆ సంధివేళ ఉండే ప్రకృతిరామణీయకం పినవీరభద్రుడు చాలా మనోహరంగా వర్ణించినాడు. ఈ ప్రత్యూషసుష మభావుకుడైన చిత్రకారుని కుంచెగీసిన వర్ణచిత్రంవలె ఉంది.

సీ॥ కుముదంబు లర్ధమర్ధము మొగంబు మొగిడ్చె నర్ధమర్ధంబు తోయజము విరిసె
స్యందనాంగంబింత నంతనుం జరియించె నింతనంతఁ జకోర మీక లిరికె
విధుకాంతశిల వెడవెడ నీరిగిరి తీసె వెడ సూర్యకాంతంబు వెచ్చనయ్యె
నిసి యించుకించుక దెసల యంచుల నిల్చె నించుకించుక దివం బీరికెత్తెఁ

తే॥ దొలఁగి పోయెడు కుముదబంధు ద్యుతియును
దోఁపుచున్న సరోజబంధు ద్యుతిమయును
శబలమై శ్వేతర క్తమై సంక్రమించె
సకల దిశలను బ్రత్యూష సమయమునను. (8-201)

కొన్నిమంచి సినిమాల్లో సంభోగశృంగారం సూచ్యంగా ప్రదర్శిస్తారు నాయికా నాయకులు మనకు తెరమీద కనపడరు. తుమ్మెదలో చిలుకలో గోర్వంకలో పాడుతున్నట్టు దంపతుల ఆనందపారవశ్యాన్ని సూచిస్తవి. అటువంటి ఏ సినిమాలు చూడకుండానే పినవీరన్న ఆ పద్ధతిని తన కావ్యంలో ప్రదర్శించినాడు. శకుంతలా దుష్యంతులు ప్రథమసమాగమ సౌఖ్యం అనుభవిస్తున్న సమయాన.

సీ॥ శ్రవణ సౌఖ్యముగా సాధుస్వనంబున మ్రోల నాలాపించె మొకరితేఁటి
మనసు రింగులు వార మణితక్వణంబునఁ జెంతనల్లన విలసిల్లె శారి
యెలఁ దొక్కుపలుకులఁ గులికి కుల్కినటించెఁ గులికియై తేనెలు చిలుకఁ జిలుక
యింపు పొంపిరి వోవ నింతనంతను నిల్చి పంచమశ్రుతిఁ బిసాళించెఁ బికము

తే॥ సమ్మదమ్ముగ సురతశ్రమమ్ము దేఱ
నంతమాత్రంబె పొలసె మందానిలుండు
తాఁకఁ బరిమళ మొకపాటి సోఁకనేసె
వలపుఁ దూపుల మరుఁడు భూవరుని సతిని (3-219)

శకుంతలను ఆశ్రమంలోనే విడిచి తాను హస్తినకు పోయేటప్పుడు చెప్పిపోదామని వచ్చిన దుష్యంతుని డోలాందోళన పరిస్థితి గమనింప దగినది.

సీ॥ చెప్పంగఁ జూచుఁ జూచి ముఖాంబుజముదెసఁ దప్పక చూచును, చెప్పనోరు
పోకనిల్చు, నుపాయములు మతించు, మతించి నేర్పుదేలేక నిట్టూర్పు వుచ్చు
నుండరామిని జెప్ప నూహించు, నూహించి పురమున-కని యర్ధమునన నిల్చు
ననసూయఁ జూచుఁ, బ్రియంవదఁ జూచు, నా మేనకాత్మజఁ జూచు, పిఁదుఁజూచుఁ,

తే॥ దరుణి దెస మోహలత యీడ్వఁ బురము దెసకుఁ
గార్యలత యీడ్వ రెండువంకలకుఁ జనుచు
భావ్యమిదియని కార్య మేర్పఱుప లేక
నుల్ల ముయ్యాల లూఁగె భూవల్లభునకు. (2-238)

ఈ పద్యం చదువుతుంటే పఠితల మనస్సులు కూడ ఆందోళవ పడుతవి.

సోమతీర్థంనుండి తిరిగివచ్చిన కణ్వుడు తనకు చెప్పకుండా పెండ్లి చేసికొన్న శకుంతలను సున్నితంగా పలుకరించిన తీరు గమనింప దగినది.

ఉ॥ ఎన్నఁడు లేనిక్రొత్తసిరి నీనెదు నీ వదనాంబుజంబు మై
చెన్నును నూత్నరేఖ విలసిల్లెడు భావములెన్ని యన్నియున్
మున్నిటి భంగిఁగాక కడుమోహనలీలలఁ గ్రాలుచున్న వీ
యున్న నిజంబు దాఁపు కొనియుండిన నా పయి నాన వెట్టెదన్, (4-14)

చ॥ విని యెలనవ్వుతోడ నరవిందనిభాననః నిన్నునింతగాఁ
బెనిచిన నన్నొకింత వినిపింపక చేసితి నీకు నర్హ కాం
తుని ఘటియింపఁ జేయుటకు ధూర్జటిఁ గొల్వఁగ సోమతీర్థమేఁ
జనినయెడన్ మనః ప్రియుఁడు చయ్యనఁ గల్గిన సంభ్రమంబునన్.

గీ॥ వనిత! యనసూయయును బ్రియంవదయు నీకు
వరుని ఘటియించి పెట్టినవారు; నీవు,
వారు సుఖముండుఁ డెక్కడో వాఁడ నయిన
యేను దీర్ఘంబు లేఁగెద నెచటికైన (4-17)

వ॥ ఇంక మాఖారంబు వాసె, రాజపత్నివైతివి, రాజ్యానుభవ సుఖంబులు మమ్ము మఱువక నీ వరునకుం జెప్పి యాశ్రమం బప్పటప్పటికి యోగక్షేమంబు లరయించుకొనుచుండు మమ్మ... (4-18)

శకుంతలా దౌహృదచిహ్నాలు భరతుని భావిభాగ్యోదయాన్ని చాలాగొప్పగా చిత్రిస్తవి. ఆమె ప్రసవించిన తరువాత మునిపత్నులు కొన్ని వేడుకలు చేస్తారు. ఈనాడు అందులో కొన్ని ఆచారాలు అర్థాలుకూడా తెలియవు. దినదిన ప్రవర్ధమానుదయ్యే భరతుని శైశవచేష్టలు కూడ పినవీరభద్రుడు అతని భావిప్రాభావం సూచించేవిగా వర్ణించినాడు. కణ్వమహర్షి శకుంతలకు బోధించిన కులసతీ ధర్మాలూ, ఆమెను సాగనంపుతూ చేసిన హితోపదేశాలూ ఈనాటివారి కందరికీ రుచింపకపోయినా ఒకప్పుడవి మన సంఘానికి ఉపాదేయాలు. కణ్వమహర్షిని విడిచి శకుంతల హస్తినకు పోయేముందు పొందినదుఃఖం పినవీరభద్రుడు చాలాగొప్పగా చిత్రించినాడు. ప్రేమగల ఆడుబిడ్డలకూ-వాళ్ళనుగన్న తల్లిదండ్రులకూ ఆ స్థితి ఈనాటికీ అనుభవంలో ఉన్నదే.

సీ॥ జనకుఁ డుండెడు ననుష్ఠాన వేదికఁ జూచుఁ జూచి, క్రమ్మఱఁబోయి చూడవచ్చు
స్నానార్థనియమిత జలజాకరముఁ జూచుఁ జూచి, క్రమ్మఱఁబోయి చూడవచ్చు
నిజహస్తపోషిత కుజవల్లికలు చూచుఁ జూచి, క్రమ్మఱఁబోయి చూడవచ్చుఁ
గుంజకోటరకుటీ క్రోడవీథులు చూచుఁ జూచి, క్రమ్మఱఁబోయి చూడవచ్చు

తే॥ తండ్రిఁ బాయంగ లేని సంతాపజలము
నత్తవారింటి కేఁగెడు హర్షజలము
గోరు వెచ్చని పాలిండ్లకొనలు దడుప
నెడపఁదడపనఁ బయ్యెదఁ దుడిచికొనుచు (4-96)

సీ॥ కదలు నాలుగు మూఁడు పదములు క్రమ్మఱితండ్రి పాదంబు నొఁదల ఘటించుఁ
గొంత దవ్వేఁగు, నేఁగుచువచ్చి కణ్వుని కడుపులోఁ దలమోపి కౌఁగిలించు
నరుగుఁ గొండొకనేలఁ దిరిగి మౌనులకు" మా యయ్య సుఁడీ" యని యప్పగించు
గమనించుఁ బెడమర్లి, కాశ్యపు దెసఁజూచి నేఁ బోదునంచుఁ గన్నీరు నించు

తే॥ జనకుఁ డుపలాలనము సేయ సంయమీంద్ర
భామల దలింప, ననసూయ పట్టి తిగువ
నిగిడి యడుగిడె నొకభంగి మగిడి
చూచుకొంచు శకుంతలా సూనగంధి (4-97)

నారదుడు భరతునికి బోధించిన రాజనీతి నాటికినేటికి ఏనాటికి కూడ ప్రజా సంక్షేమం కాంక్షించే పాలకులు శ్రద్ధగా పాటించవలసినదే. ఈ రాజనీతి అంతా బాగుందికాని మంత్రి పదవికి చాతుర్వర్ణ్యం వారిలో వైశ్యుడుమాత్రం పనికిరాడంటాడు ఎందువల్లనో? ఆ ఒక్క విషయం విడిచిపెట్టి మంత్రిపదవికి కావలసిన అర్హతలు ఏవిధంగా చెప్పినాడో గమనించండి.

సీ॥ పతిహితుం, దతిధర్మపరుఁడు, నీతిధురీణుఁ డింగితజ్ఞుండు, జితేంద్రియుండు
మంత్రరక్షకుఁ డన్యమర్మభేది, ప్రజానురాగి, సుశ్రోత, నీరాగి, భోగి
యుచిత యత్న తరస్వి, యుత్కోచ విముఖుండు శాంతు: దతిప్రౌఢ, సత్యవాది
పరధన పరదార పరపరివాద వర్జితుఁడు, ప్రఖ్యాతుండు, శ్రీకరుండు

తే॥ బ్రాహ్మణుడు మంత్రిగాఁ దగుఁ బరిగణింప
గుణము లిట్టివిగా సమకూరెనేని
క్షత్రియుని శూద్రునిం దప్ప సచివపదవి
వైశ్యు నిలుపంగఁ దగదు భూవల్లభునకు (4-178)

ఈ కావ్యంలో భరతుని గురించి ఒక విశేషం ఉంది. శకుంతలను నిరాకరించిన దుష్యంతునికి అనసూయా ప్రియంవదలు భరతుణ్ణి చూపి ఆతనితో ఇట్లా అంటారు.

ఉ॥ అద్దములోని నీడవలె నాకృతియందొక లేశమాత్రముం
బిద్దముగాక, నీకుఁ బతిబింబమువోలె వెలుంగుచున్ననీ

పెద్దకుమారు భూవర! యభిన్నగతిన్ మొగమెత్తిచూడుమా
ముద్దియ నీ పయింగలుగు మోహము భక్తియుఁ గాన నయ్యెడిన్(4-124)

దుష్యంతునికి భరతుడు పెద్దకుమారుడట. చిన్నకొడుకులు వేరే ఉన్నారన్నమాట. పెద్దవాడు కనుక ఈతడే యౌవరాజ్యపట్టానికి అర్హుడన్నమాట. దుష్యంతునికి శకుంతలకంటె ముందుగా చేసికొన్న భార్యలున్నారా? లేకపోతే కణ్వాశ్రమంనుండి తిరిగి వచ్చి శాపంమూలంగా శకుంతలను మరచిపోయి మరికొందరినో ఒకరినో వివాహం చేసికొన్నాడా? శకుంతలకంటే ముందే భార్యలుంటే వారికి అప్పటికి సంతానం కలుగ లేదా? కలిగిఉంటే శకుంతలా వివాహానికి అనసూయా ప్రియంవదలు విధించిన షరతు (పుట్టబోయే కొడుక్కు యౌవరాజ్యపట్టం కట్టటం) ఎందుకు ఒప్పుకుంటాడు? ఈ పద్యంలో సైకాలాజీకి సంబంధించిన మరికొన్ని విశేషాలున్నవి. ఇప్పటికే గ్రంథం పెరిగిపోయింది. సూక్ష్మేక్షికతో చూస్తే ఈ కావ్యంలో మరికొన్ని విశేషా లున్నవి. విస్తరభీతిమూలంగా విడిచిపెడుతున్నాను.

## జైమిని భారతము

పినవీరభద్రుని కృతుల్లో మనకు దక్కిన రెండో గ్రంథం జైమినిభారతం. పినవీరభద్రుని అన్న పెద్దవీరన్నగారు. ఆయన సాళువనరసింహరాయల కొలువులో మంచిపదవిలో ఉండేవాడట. అన్నగారి ఆసరాతో పినవీరభద్రుడు పాకనాడు విడిచి రాయలసీమకు తరలిపోయి ఉంటాడు. సంగమవంశం బలహీనమై పోయి సాళువ నృసింహరాయలు అధికారం పుంజుకుంటున్న కాలంనుండే ఆశ్రితులైన పిల్లలమఱ్ఱి సోదరులు, నరసింహరాయలు పట్టభద్రుడైన తరువాత తామూ పట్టపగ్గాలు లేనివారు ఐ యుంటారు. నరసింహరాయలు గొప్ప విజేత, పండితుడు, కవి. ఆత డొకనాడు నిండుపేరోలగంలో

క॥ నామది నిరతము భారత
రామాయణ కథలఁ బ్రేమ రంజిలు నందున్
జైమిని భారతమనఁగా
భూమి నపూర్వము పురాణముల గణియింపన్. (1-17)

తే॥ ఆ పురాణంబు గనఁ దెనుఁ గయ్యెనేనిఁ
జెప్పనేర్చిన కవియుఁ బ్రసిద్ధుఁడేనిఁ
దెనుఁగు నుడికారమున మించుగనియెనేనిఁ
గుందనము కమ్మవలచిన చందమగును. (1-18)

అంటాడు. అప్పుడా సభలోని వాళ్ళలో కొందరు

క॥ ఏ రీతి నెఱిఁగెనో పిన
వీరన దేవరతలంపు విఖ్యాతముగాఁ
బేరును బెట్టిదియును దన
పేరుగ రచియింపఁబూనెఁ బేశలఫణితిన్ (1-19)

అని పినవీరన జైమినిభారతం వ్రాయపూనుకున్నాడంటారు. అంటే రాజుగారి మనసులోని కోరిక పినవీరన ఇదివరకే గ్రహించి జైమినిభారతం అనువాదానికి పూనుకున్నాడన్నమాట. పినవీరనకు ఈ పరేంగితజ్ఞానం ఉపాసనాబలంవల్ల కలిగిందనీ అన్నగారైన పెదవీరన ఒకసారి అనుష్ఠానంలో ఉండికూడా తన భార్య సొమ్ముల గూర్చి ఆలోచిస్తుండటం పినవీరన గ్రహించి చెప్పినాడనీ, అనుశ్రుతంగా వస్తున్న వింతకథలు. పినవీరన శారదా ఉపాసకుడు కనుక ఇటువంటి మహిమలు ఆ యమ్మ కటాక్షం మూలంగా కలిగినవని వాడుక. పినవీరన శారదా ఉపాసకుడు నిజమే. "వాణి నా రాణి" అన్నాడంటే ఆతని అభిప్రాయం వాణి తన మంత్రాధిష్ఠాన దేవతయైన రాజ్ఞి అని, పినవీరన శారదా స్తుతి చేసిన పద్యాలవల్ల ఈ విషయం స్పష్టంగానే తెలుస్తుంది,

సీ॥ ప్రణవపీఠమున మంత్రపరంపరలు గొల్వనుండు నేదేవి పేరోలగంబు
భావజ్ఞులకుఁ బరాపశ్యంతి మధ్యమా వైఖరు లేదేవి వర్ణసరణి
జపహార కీరపుస్తక విపంచి సమంచితంబు లేదేవి హస్తాంబుజములు
కుందేందు మందార కందళీబృందంబు చందమే దేవి
యానంద మూర్తి

తే॥ కాంచె నేదేవి కాంచన గర్భు చతుర
పూర్వ దంతకవాట విస్ఫుట మనోజ్ఞ
చంద్రకాంత శిరో గృహస్థల విహార
మమ్మహాదేవి వాగ్దేవి నభినుతింతు. (1-5)

దేవీ ఉపాసనాపరులు రాణీ, రాజ్ఞీ ఇత్యాది పేర్లుంచుకుంటారు. ఆనందగజపతి ఆస్థాని శ్రీ విద్యోపాసకులూ కాలమానోత్పత్తి చిత్సూర్యాలోకనం మొదలైన కృతులు వ్రాసిన రాణీమహాగ్నిచిత్ నరసింహకవి (జననం 1860) గత శతాబ్దం వాడని మనకందరికీ తెలుసు. రాణి పేరులోని ఈ పరమార్థాన్ని మరచిపోయి ఎవరో

పినవీరనకు వాణిని రాణి చేసినారు. వాణి ఆతనికి రాణియే కాని అందరు చెప్పుకొనే అర్థంలో మాత్రం కాదు.

సాళువ నరసింహరాయలకు జైమినిభారతం ఇష్టం కావటానికి కారణం అతడు చంద్రవంశ క్షత్రియుడు, జైమిని భారతం చంద్రవంశజులైన పాండవుల గొప్పతనాన్ని అందులోను అర్జునుని పరాక్రమాతిశయాన్ని వర్ణించేది. నానా యుద్ధ విజేతయైన నరసింహరాయలకు తమపూర్వుడైన అర్జునుని విజయాలను వినాలె ననే కాంక్ష ఉండటం సహజమే. నరసింహరాయలు వైష్ణవుడు కావడం కూడ ఒక కారణం. జైమిని భారతం కృష్ణపారమ్యాన్ని చాటే పురాణం కూడ. ఈ విషయమై కవి ఈ విధంగా చెప్పినాడు.

క॥ స్తుత్యము కలికల్మషరా
హిత్యము నాఖ్యాయికా విహితబీజ చతు
స్సిత్యము శ్రీహరికథలను
నిత్యంబును నైన జైమినిజభారతమున్. (1-9)

ఇటువంటి పవిత్రమైన ప్రశస్తమైన కృతి గనుకనే పినవీరన జైమినిభారతాన్ని చంపూ కావ్యంగా వ్రాస్తానంటాడు.

శా॥ జంబూద్వీపములోన నెంతయుఁ బ్రశస్తంబైన దీని న్నట
ద్రంభాకుండల జూట కోటరకుటీ ధృత్స్వర్ధునీ వీచికా
లంబిస్విన్ననవేందుకందళ సుధాలంకార వాగ్వైఖరిన్
జంబూకావ్యము చేసెదన్ బుధజనశ్లాఘాసిరాఘాటతన్ (1-10)

చంపూకావ్యము అనే మాటను తెలుగువాళ్ళల్లో ప్రథమంగా చంబూ కావ్యం అన్నవాడు పినవీరన్నయే. తమిళులుకూడ చంబూ కావ్యం అంటారట. 19 వ శతాబ్దంలో ఉండిన పరశురామపంతుల అనంతరామపండితుడు సంస్కృతంలో సీతా విజయం అనే చంపువు వ్రాసినాడు. ఆతడుకూడా తనది చంబూ ప్రబంధం అన్నాడు. ఆ మాటలో తెలుగువాళ్ళకు స్ఫురించే అశ్లీలాన్ని పరిహరించటానికై చంబూకావ్యం అన్నాడేమో అనిపిస్తుంది.

వ్యాసభారతంవలెనే జైమినిభారతంకూడ ఉద్గ్రంథమని కొందరన్నారు. వ్యాసుని శిష్యుడైన జైమిని వ్రాయలేదు, ఎవరో దాక్షిణాత్యుడు అశ్వమేధపర్వం మాత్రమే వ్రాసినాడన్నారు మరి కొందరు. సంస్కృతంలో అచ్చైనది జైమిని

పేరుతో ఈ అశ్వమేధపర్వం మాత్రమే. కాని ఇటీవల మరికొన్ని పర్వాలు లభించినాయని వినికిడి. పినవీరన్న ఈ అశ్వమేధ పర్వాన్ని ఎనిమిది ఆశ్వాసాల ప్రబంధంగా అనువదించినాడు. 18 వ శతాబ్దం ప్రారంభంలో మధురను పాలించిన విజయ రంగచొక్కనాథుని సైన్యాధిపతి సముఖం వెంకటకృష్ణప్పనాయకుడీ జైమిని భారతాన్ని తెలుగువచనంలో వ్రాసినాడు, ఈ వచనరచనం మూలంగానే తెలుగు విద్యార్థులకు జైమినిభారతం పరిచయం. ప్రాచీన వచన రచనకు మచ్చుతునకలుగా ఇందులోని ఉద్దాలకోపాఖ్యానమూ చంద్రహాసోపాఖ్యానమూ పాఠ్యగ్రంథాల్లో అప్పుడప్పుడు చేరుస్తుంటారు. జైమినిభారతంలోని ప్రమీలకథ, బభ్రువాహన విజయం కథలుకూడ నాటకాలుగా యక్షగానాలు తెలుగువారికి బాగా పరిచయం. శాకుంతలం పినవీరన్న స్వతంత్రకావ్యం కనుక అందులో ఆయన కల్పనాశక్తికి చాలా అవకాశాలు లభించినవి. జైమినిభారతం అనువాదం కనుక ఇందులో అటువంటి చొరవచేసికోవటానికి వీలుకలుగలేదు. ఐతే పద్యరచనాశిల్పానికీ వర్ణనలకూ తెలుగునుడికారానికి పినవీరన్న ఈ కృతిని బాగా వాడుకున్నాడు. కవిత్రయం వారి భారతానువాదం వలెనే. పినవీరన జైమినిభారతం కూడ చక్కటి అనువాదమే అంటారు విజ్ఞులు.

జైమినిభారతంలోని వృత్తాంతం క్లుప్తంగా తెలిసికొందాము, జైమిని భారతానికి కూడా జనమేజయుడే శ్రోత. అతడు తమ తాతగారైన ధర్మరాజు కురుక్షేత్ర యుద్ధానంతరం ఏ విధంగా అశ్వమేధం చేసినారు? అని జైమినిని అడుగుతాడు. జైమిని ఆ వృత్తాంతం సవివరంగా వినిపిస్తాడు.

జ్ఞాతివధ పాతకానికి ఒడిగట్టినందుకు చింతాకులుడై ఉన్న ధర్మరాజు వద్దకు వ్యాసుడు వస్తాడు, ధర్మరాజు తన పాపం తొలగిపోయే మార్గం చెప్పుమంటాడు. అశ్వమేధం చేస్తే పాపం పోతుందంటాడు వ్యాసుడు, అశ్వమేధం చేయటానికి వలసిన ధనం ఉన్న చోటూ దానికి కావలసిన గుఱ్ఱం లభ్యమయ్యే ప్రదేశమూ, అశ్వమేధ విధానమూ వ్యాసులవారే చెప్పుతారు. భీముడు ఆ అశ్వాన్ని పట్టుకవస్తానని ఘోరమైన ప్రతిజ్ఞ చేస్తాడు. కర్ణునికొడుకు వృషకేతుడూ, ఘటోత్కచుని కొడుకు మేఘవర్ణుడూ యజ్ఞాశ్వం తేవటానికి భీమునికి బాసటగా ఉంటామంటారు. తలచుకొన్నంత మాత్రాన ఆర్తత్రాణపరాయణుడైన శ్రీకృష్ణుడు వచ్చి ధర్మరాజు ప్రయత్నం విని సంతోషించి భీమునికి ఉత్సాహం కల్పించి ధర్మరాజు రక్షణకై ఏర్పాట్లు చేసి అంతర్హితుడై పోతాడు.

భీమాదులు సవనాశ్వం కోసం యౌవనాశ్వుని భద్రావతీపురం వెళ్తారు. మేఘవర్ణుడు మాయచేసి యజ్ఞాశ్వాన్ని పట్టుకుంటాడు. యౌవనాశ్వుని సైన్యాలు విజృంభిస్తే వృషకేతుడు ఎదుర్కొంటాడు. ఘోరమైన సంగ్రామం జరుగుతుంది, వృషకేతుడు మూర్ఛపోగా భీముడు యుద్ధం చేస్తాడు. తేరుకొన్న వృషకేతుడు యౌవనాశ్వుని మూర్ఛపోయే విధంగా గాయపరచి అతని ప్రాణాలు పోకుండా కృష్ణుణ్ణి ప్రార్థించి తానే శైత్యోపచారాలు చేస్తాడు. యౌవనాశ్వుడు తేరుకొని భీమాదులతో స్నేహం చేసి యజ్ఞాశ్వాన్ని అప్పగించటమేగాక తానుకూడా సవనాశ్వరక్షకుడుగా వారి వెంట బయలుదేరుతాడు. అంతా కలిసి హస్తినాపురం వస్తారు. అతిథి సత్కారాలు బాగా జరుగుతవి. వ్యాసులవారు వచ్చి ధర్మరాజుకు మరుత్తరాజు చేసిన హయమేధ వృత్తాంతం వినిపించి ధర్మాలుపదేశించి యజ్ఞసన్నాహాలు చేయవలసిందిగాను శ్రీకృష్ణుని తోడ్పాటు పొందవలసిందిగాను చెప్పిపోతాడు. ధర్మరాజు ఆజ్ఞ ప్రకారం భీముడు శ్రీకృష్ణుణ్ణి సపరివారంగా తోడ్కొనివస్తాడు. ఇంతలోగా అనుసాళ్వుడనే రాక్షసుడు శ్రీకృష్ణునిపై పాత పగ సాధించటానికై యజ్ఞాశ్వాన్ని అపహరించి యుద్ధానికి తలపడుతాడు. శ్రీకృష్ణుణ్ణి మూర్ఛింపజేస్తాడు. వృషకేతుడు ఘోరంగా పోరాడి అనుసాళ్వుని బంధించి తెచ్చి శ్రీకృష్ణుని పాదాలమీద వేస్తాడు. అనుసాళ్వుడు చెలికారం నెరపి హయరక్షణానికి తోడుగా ఉంటాడు. చైత్రశుద్ధపౌర్ణమినాడు ధర్మరాజు యజ్ఞదీక్షితుడై గుఱ్ఱాన్ని విడిచి పెడుతాడు. అశ్వరక్షకులుగా అర్జునుడు ప్రద్యుమ్నవృషకేతులు యౌవనాశ్వ అనుసాళ్వులు సైన్యాలతో బయలుదేరుతారు. యజ్ఞాశ్వం నానా దేశాలు తిరిగి మాహిష్మతి నగరం చేరుతుంది. ఇంతటితో మూడాశ్వాసాలు ముగిసినవి. ఈ మూడు ఆశ్వాసాల్లోను భీమునిపాత్రకు ప్రాధాన్యం ఉంది.

నాల్గో ఆశ్వాసం నుండి సవనాశ్వరక్షకుడైన అర్జునునికి ప్రాధాన్యం. మాహిష్మతి పాలకుడైన నీలధ్వజునితో యుద్ధం సంభవిస్తుంది. అగ్నిదేవుడు ఈ నీలధ్వజ మహారాజుకు అల్లుడు. పావకాస్త్రంతో నీలధ్వజుడు అర్జునుణ్ణి అతని సైన్యాలను బాగా నొప్పిస్తాడు. అగ్నిభట్టారకుని హితోపదేశంతో నీలధ్వజుడు అర్జునునితో స్నేహం పాటించి సవనాశ్వరక్షకు తానూ తోడ్పడటానికి అంగీకరిస్తాడు. కాని నీలధ్వజుని భార్య జ్వాల అర్జునునిపై పగబట్టి కాశికి పోయి గంగకు అర్జునునిపై కోపం తెప్పించి అతడు ఆరు నెలల్లో చచ్చే విధంగా శాపం పెట్టించి తాను ఆత్మాహుతి చేసికొని అర్జునుణ్ణి చంపటానికై వేచి ఉంటుంది. అక్కడి నుండి బయలుదేరిన సవనాశ్వం

సౌబరి ఆశ్రమానికి పోయి ఒక శిఖకు అంటుకొని పోతుంది. సౌబరి అర్జునునికి ఉద్దాలకోపాఖ్యానం వినిపిస్తాడు. అర్జునుని హస్తస్పర్శతో రాయిగా పడి ఉన్న చండిక శాపావసానం జరుగుతుంది. సవనాశ్వం చంపకాపురం చేరుతుంది. అక్కడి రాజు హంసధ్వజుడు విష్ణుభక్తుడు. ఆతని కొడుకు సుధన్వుడు తండ్రి కంటె గొప్ప విష్ణు భక్తుడు. అర్జునుడు వారితో ఘోరమైన యుద్ధంచేసి అలసిపోయి శ్రీకృష్ణుణ్ణి స్మరిస్తాడు. శ్రీకృష్ణుని స్వీయతేజో విశేషం అర్జునుని బాణంలో ప్రవేశించిన ఫలితంగా సుధన్వుని మరణం సంభవిస్తుంది. హంసధ్వజుని రెండవకొడుకు సురధుడు యుద్ధం చేసి చనిపోతాడు. హంసధ్వజుడు శ్రీకృష్ణార్జునులతో చెలిమి చేసి సవనాశ్వరక్షకుడుగా బయలుదేరుతాడు. శ్రీకృష్ణుడు హస్తినాపురం వెళ్ళిపోతాడు. మార్గమధ్యంలో ఒక చోట యజ్ఞాశ్వం గోడిగగా మారిపోతుంది. శ్రీకృష్ణుణ్ణి ప్రార్థించగా దానికి మరల పూర్వ రూపం వస్తుంది. అటు తరువాత అది స్త్రీమండలం ప్రవేశిస్తుంది. అక్కడ ప్రమీల అర్జునునితో యుద్ధం చేస్తుంది. అర్జును డామెను సంతోషపరచి ముందుకు సాగిపోతాడు. ఆటు తర్వాత వృక్షదేశంలో రాక్షసులతో యుద్ధం జరుగుతుంది. బకాసురుని కొడుకు భీషణుడనేవాడు అర్జునుని చేతిలో చనిపోతాడు. యాగాశ్వం మణిపురం చేరుతుంది. అర్జునునికి చిత్రాంగదవలన కలిగిన బభ్రువాహనుడు దాని ఏలిక. అతని మంత్రి తెలియక యజ్ఞాశ్వాన్ని బంధిస్తాడు. జరిగిన తప్పిదానికి బభ్రువాహనుడు తండ్రిని క్షమాభిక్ష వేడుకుంటాడు. నెత్తి మీద శాపం తారట్లాడుతున్న అర్జునుడు బభ్రు వాహనుణ్ణి తన్ని నీచంగా అవమానించి దుర్భాషలాడి యుద్ధానికి ఆహ్వానించి కొరవితో తలగోకి కొంటాడు. కుశుడు శ్రీరామునితో తలపడ్డట్లు బభ్రువాహనుడు అర్జునునితో యుద్ధం చేయటానికి సన్నద్ధుడౌతాడు. ఈ ఉపమానంతో జనమేజయుడు కుశల వోపాఖ్యానం విన కుతూహలపడుతాడు. ఆరో ఆశ్వాసమంతా ఉత్తరరామాయణం కథ. అంటే కుశలవోపాఖ్యానమన్న మాట.

ఏడవ ఆశ్వాసం బభ్రువాహనార్జునుల యుద్ధంతో ప్రారంభం ఔతుంది. బభ్రువాహనుడు భీకరసంగ్రామం చేసి వృషకేతుని అర్జునుని తలలు నరికి విజయోత్సాహంతో నగరానికి పోతాడు. అర్జునుని మరణవార్త విని చిత్రాంగద, ఉలూచి దుఃఖిస్తారు. ఉలూచి తన తండ్రియైన శేషునివద్ద నుండి మృతసంజీవనీ రత్నం తెప్పించటానికి ప్రయత్నించి విఫలురాల వుతుంది. బభ్రువాహనుడు పాతాళం మీదికి ఎత్తిపోయి సంజీవమణి తెస్తాడు. కాని నాగకుమారులు అర్జునుని తలను అపహరిస్తారు. అక్కడ కుంతికి అపశకునాలు తోచి శ్రీకృష్ణుణ్ణి ప్రార్థిస్తుంది.

శ్రీకృష్ణుడు కుంతీ యశోదలతో భీమునితో బయలుదేరివచ్చి అర్జున వృషకేతులను సంజీవమణితో బ్రతికిస్తాడు. భీముడు బంధువులతో హస్తినకు పోతాడు. శ్రీకృష్ణ బభ్రువాహనులు యాగాశ్వరక్షణార్థమై అర్జునుని వెంట ఉంటారు. యాగాశ్వం మయూరధ్వజుడనే విష్ణుభక్తుడు పాలించే రత్నపురం చేరుతుంది. మయూరధ్వజుడు కూడా అశ్వమేధం చేయతలపెట్టి యాగాశ్వం వెంట తన కొడుకు తామ్రధ్వజుణ్ణి పంపుతాడు.

ఈ రెండు యజ్ఞాశ్వాలు తలపడటంతో తామ్రధ్వజుడు శ్రీ కృష్ణార్జునులను ఎదిరించి వారిని మూర్ఛింపచేసి గుఱ్ఱాన్ని తండ్రికప్పగిస్తారు. యుద్ధంలో మయూరధ్వజుణ్ణి ఓడించలేమని శ్రీ కృష్ణార్జునులు బ్రాహ్మణ వేషంతో పోయి అతని అర్ధాంగాన్ని యాచిస్తారు. శిబి చక్రవర్తివలె మయూరధ్వజుడు తన శరీరం సగం కోసి వారికిస్తాడు. శ్రీ కృష్ణార్జును లాతనికి నిజరూపాలతో ప్రత్యక్షమై ముందుగా అతని అశ్వమేధం సఫలంచేసి మైత్రి నెరపి అతడు తోడురాగా మరల బయలు దేరుతారు. జంటగుఱ్ఱాలు సారస్వతపురం చేరుతవి. వీరవర్మ అనే విష్ణుభక్తుడు దాని ఏలిక. అతనికి యమ ధర్మరాజు అల్లుడు. వీరవర్మతో యుద్ధం చేసి శ్రీ కృష్ణుని ఆజ్ఞ ప్రకారం అతనితో స్నేహం పాటించి అర్జునుడు అక్కడి నుండి బయలుదేరుతాడు. యజ్ఞాశ్వాలు ఒక పెద్ద నదం దాటిపోతాయి. అర్జునాదు లానదం దాటే సరికి అవి కనపడవు. నారదుడు ప్రత్యక్షమై యజ్ఞాశ్వాలు చంద్రహాసుని కుంతలదేశం చేరినట్లు చెప్పుతాడు. చంద్రహాసుడు గొప్ప విష్ణుభక్తుడే కాదు దుర్నిరీక్ష్యుడు కూడ. శ్రీ కృష్ణుడు అర్జునునికి ఈ చంద్రహాసోపాఖ్యానం చెప్పి అతనితో స్నేహం చేయిస్తాడు. చంద్రహాసుడు కూడ కిరీటివెంట బయలుదేరుతాడు. గుఱ్ఱాలు ఉత్తరసముద్రంలోని ఒకదీవి ప్రవేశిస్తవి. అది అతిపురాతనుడైన బకదాల్భ్యుని ఆవాసం. శ్రీకృష్ణాదు లాతనికి నమస్కరించి మన్ననలంది బకదాల్భ్యుణ్ణి వెంటబెట్టుకొని గుఱ్ఱాలతో బయలుదేరుతారు. అంతా కలిసి సైంధవనగరం చేరుకుంటారు. అర్జునునిరాకవిని దాని ఏలిక జయద్రథుని కొడుకు గుండెలు పగిలిచస్తాడు. అతని తల్లి దుస్సల పుత్రభిక్ష యాచిస్తుంది. శ్రీ కృష్ణు డా సైంధవుణ్ణి బ్రతికిస్తాడు. సైంధవుడు కూడ. హయమేధానికి సబంధుకంగా బయలుదేరుతాడు. ఇప్పటికి ఒక సంవత్సరం కావచ్చింది.

ఆశ్వాలను తీసికొని రావలసిందిగా అర్జునాదులకు చెప్పి శ్రీ కృష్ణుడు ముందుగా హస్తినాపురం పోయి ధర్మజాదులకు శుభవార్త వినిపిస్తాడు. ధర్మరాజు యథోచితంగా ఎదురుపోయి బకదాల్భ్యాది మునులను తక్కిన రాజులను సగౌరవంగా

తోడ్కొని నగరం ప్రవేశిస్తాడు. బకదాల్భ్యుడు బ్రహ్మగా, వ్యాసుడు ఆచార్యుడుగా, వసిష్ఠాదులు ఋత్విజులుగా శ్రీ కృష్ణుని కరుణాకటాక్షాలు అండదండలుగా ధర్మరాజు యజ్ఞం పూర్తిచేసి అందరినీ దక్షిణలచేత కానుకలచేత సంతృప్తి పరచి శ్రీ కృష్ణుణ్ణి పూజించి క్రతుఫలం ఆతనికి ధారపోస్తాడు. భీముడు తన పాకశాస్త్ర ప్రావీణ్యంతో అందరికీ భోజనతృప్తి కలిగిస్తాడు. ఇద్దరు బ్రాహ్మణులు క్షేత్ర నిక్షేపం నీదే అంటే నీదే అని తగవులాడుకొని ధర్మరాజును తీర్పు చెప్పమంటారు. శ్రీ కృష్ణుడు వారిని మూడు నెల్ల తరవాత రండని పంపిస్తాడు. మూడునెలల్లోగా కలియుగం ప్రవేశిస్తుందనీ, అప్పటికా వాది ప్రతివాదుల బుద్ధులే విపరీతంగా ముదిరిపోతాయని అంటాడు. ఈ సందర్భంగా శ్రీ కృష్ణుడు ధర్మరాజుకు కలియుగ ధర్మాలు చెప్పి,

క॥ ఆ సమయంబున ధర్మజు
నే సోమకులంబునను జనించి కుటిలులన్
శాసించి ధరణిపాలన
చేసెదఁ దగ సాళ్వనారసింహుఁడ నగుచున్

అని చెప్పి ద్వారకకు పోతాడు. ధర్మరాజు జననుతంగా సమస్త భూమి పాలిస్తాడు. ఫలశ్రుతితో ఈ ఎనిమిది ఆశ్వాసాల కావ్యం మంగళాంతంగా ముగుస్తుంది.

ఇక జైమిని భారతంలోని కొన్ని విశేషాలను మనవి చేస్తాను.

అశ్వమేధం చేయటానికి తనవద్ద కావలసిన ధనం లేదని ధర్మరాజు అంటే వ్యాసులవారు ధనం జాడ ఈ విధంగా చెప్పినారు.

ఉ॥ వాలిన వేడుకన్ బహు సువర్ణమఖంబున మున్మరుత్త భూ
పాలునిచే మహీసురు లపారసుదక్షిణ లంది తెప్పలం
దేలి యథేచ్ఛఁ గొంచరుగ నిల్చిన విత్తము వెక్కసంబుగా
మూలుగుచున్న దిప్పుడు నముద్రితమై తుహినాద్రి చేరువన్. (1-66)

ఈ బంగారం అంతా ధర్మరాజే తెచ్చుకొన్నాడో ! ఈ నాటికీ ఏమైనా మిగిలి ఉందో ! తెలియదు. అసలు ఈ భూభాగం ఇప్పుడు మనదేశంలోనే ఉందో లేదో కూడ తెలియదు.

యాగాశ్వం తీసుకవస్తానని ఘోరమైన శపథం చేసిన భీముణ్ణి ప్రోత్సహించటానికో ఏమో శ్రీ కృష్ణుడు భీముణ్ణి ఇట్లా హేళన చేస్తాడు.

క॥ మందమతియు బహ్వాశియుఁ
దుందిలుఁడును రాక్షసీరతుఁడు నిష్ఠురవా
క్సందర్భుఁడు నగు మారుత
నందను సచివతఁ బ్రయోజనములు ఫలించున్. (1-120)

ఈ సందర్భంగా భీమ శ్రీ కృష్ణుల మధ్య హాస్య పూరితమైన సరసాలాపాలు జరుగు తవి. భీముడు వ్యాజస్తుతిగా ఈ విధంగా సమాధానం చెప్తుతాడు.

సీ॥ మొదల నత్యంతకాముకుఁడ వౌటకు గొల్ల యిల్లాండ్ర గుబ్బ పాలిండ్లు సాక్షి
యతినీచరతిశీలి వగుటకుఁ బాతీన కమఠ సూకర విగ్రహములు సాక్షి
బహ్వాశి వగుటకు బ్రహ్మాండ కోట్లును బూరింపలేని నీ బొజ్జ సాక్షి
స్త్రీలోలుఁడగుటకుఁ దైౖలోక్యము నెఱుంగ ధరకుఁ దెచ్చిన వేల్పు
తరువు సాక్షి

తే॥ జడ సముత్సాహివగుటకు జలధి సాక్షి
వామనుఁడ వగుటకు బలీశ్వరుఁడు సాక్షి
మందమతివౌట నది మఱపొందెఁగాక
సరవిఁ బేర్కొనఁ దరమె నీ సటలు కృష్ణ. (1-126)

ఐతే భీముడు తానిదివరకు చేసిన ఘనకార్యాలన్నీ శ్రీ కృష్ణ పరమాత్మ కరుణాకటాక్షం వల్లనే జరిగినవని భక్తిని గూడ ప్రకటిస్తాడు.

యౌవనాశ్వుని సేనావధూటితో క్రీడించకుతూహలం కలిగిన వృషకేతుడు పినతండ్రియైన భీముణ్ణి కోడలికి దూరం తొలగవలసిందిగా చమత్కారంగా కోరు తాడు.

క॥ కరియానం బటుపాశహస్తఁ బృథుశంఖగ్రీవఁ జక్రస్తనిన్
బరసేనారమణిన్ వరించితి నురోభాగంబునన్ నిల్చె ని
ర్భరకేశిన్ విషమాస్త్ర చిహ్నములు సేరన్ వావి గాదింక మా
ను రణోత్సాహము నీవు జన్యరతిఁగాంతున్నే యశస్వంతతిన్.(2-49)

తే॥ నన్ను వరియించినది కారణంబుగాఁగ
దేవరకుఁ గోడలైన సేనావధూటి
సిగ్గు పెంపున మొగము వాంచినది చిత్ర
వైజయంతీ నవాంశుక వ్యాజమునను. (2-50)

అందుకు భీముడు సరేనని ఆకోడలు తన కొడుక్కు సరిగా కైవసం కాకపోతే శిక్షించటానికి సిద్ధంగా దూరాన ఉంటానంటాడు.

ఉ॥ నావుడు వాయునందనుఁడు నందన పొమ్ము చమూవధూటి నీ
కైవసమైన లెస్స యటుగాక నినుం దల మీఱెనేని దౌ
దౌవుల నిల్చి మద్భుజగదా పటు విభ్రమ తాడనంబులన్
జేవయడంతు నెందు గురుశిక్షఁగదా మతిగాంతు రంగనల్. (2-51)

ఈ గ్రంథంలో స్త్రీల యెడ చాలా చోట్ల చిన్న చూపున్నది. వ్యాసులవారు అదే పనిగా ధర్మరాజుకు సుదీర్ఘంగా జార స్త్రీలక్షణాలు చెప్పుతారు. జారస్త్రీల గురించి కఠినంగా చెప్పితే చెప్పినాడు గాని

క॥ ఎచ్చోట విలాసినులకు
మచ్చికఁ జన విచ్చినం బ్రమాదము పతికిన్
వచ్చు నవశ్యము కాంతలు
చచ్చినపుడు విశ్వసింపఁ జనదెవ్వరికిన్ (3-32)

క॥ అత్తయు మామయు మగఁడును
గత్తులబోనులయి బిఱుసుగావలె నెపుడున్
మత్తచకోరాక్షులకును
జిత్తము పరపురుష భోగ శీలం బగుటన్ (3-33)

తే॥ బాల్యమునఁ దల్లిదండ్రులు ప్రాయమున ధ
వుండు వార్ధకమున నందనుండుఁ జెప్పి
నట్లు చేయంగఁ దగుఁ గాని యరసి చూడఁ
దెలవలకు నెందు దమ యిచ్చఁ దిరుగఁ జనదు. (3-37)

అనటం ఈనాటి వారికి రుచించకపోవచ్చు.

శ్రీ కృష్ణునంతవాడు సరోవరతీరంలో విడిది చేసినప్పుడు రుక్మిణితో జరిపిన సల్లాపాలు ఆమె సమాధానాలు ఈ సందర్భంలో గమనించదగినవి.

చ॥ కమలదళాక్షుఁ డంత నిజకామిని రుక్మిణితోడ నిట్లనున్
గమలినిఁ జూచితే ప్రియుఁడు గన్గొనరామి మరాళసామజ
భ్రమరకులంబు పైఁ బడఁ గరంబు సుఖించెడుఁ గామమెప్పుడున్
రమణుని కంటె నెన్మిదిగుణంబులు గాదె లతాంగి కారయన్. (3-67)

క॥ అనవిని రుక్మిణి విభుతో
నను( దనయుని వాహనంబు హంసము దనవా
హన మేను(గు దేటుల యెడ(
దనుజ భావమగు( గాన( దగదిటు పల్కన్ (3-68)

క॥ తా మొదలం బద్మని య(ట,
గామించునె యన్యపురుషు( గలలో నైనన్
తామరసనేత్ర ! యంత
ర్యా మివి నీవెఱు(గ నట్టియర్థము గలదే. (3-69)

ఈ అంతర్జాతీయ మహిళా సంవత్సరంలో పినవీరన బ్రతికి ఉంటే చచ్చే వాడు. చచ్చినాడు కాబట్టి బ్రతికిపోయినాడు.

భీమ శ్రీ కృష్ణుల సమావేశం జరిగినపు డల్లా హాస్యసంభాషణలకు వీలు కల్పించినాడు కవి. ధర్మరాజు శ్రీ కృష్ణుణ్ణి తీసుక రావటానికి భీముణ్ణి ద్వారవతికి పంపిస్తాడు. భీముడు ద్వారక చేరే సమయానికి శ్రీ కృష్ణుడు భోజనం చేస్తుంటాడు. భీముణ్ణి చూచి తరువాత క్షేమ సమాచారాలు చెప్పుదువుగాని ముందుగా భోజనం చెయ్యి అలసి పోయినా వంటాడు శ్రీ కృష్ణుడు. నీ పొత్తున తింటే నాకు ఆకలి తీరదని భీముడు శ్రీ కృష్ణుణ్ణి ఈ విధంగా వేళాకోళం చేస్తాడు.

సీ॥ తల్లి చన్నుల పాలు ద్రావియంతట( బోక పూతన( బొరిగొంటి పురిటిలోన
జనని యుగ్గున( దృప్తి సనక నిన్నటి దా(క వెర(జితి వ్రేపల్లె వెన్నలెల్ల
నంబ పొత్తున( దనియక వెక్కసంబైన యుదరాగ్ని నార్చి
తింద్రోత్సవమున
జనయిత్రి యొస(గు భక్షణము చాలక తింటివా కుచేలుని చేతి యడుకు
లొడిసి

తే॥ కడుపు లోపల సకలలోకములు వరుస(
గూరు కొన్నప్పుడును నఱగొఱ(తగాని
తుష్టి(డవు గావు నీదు పొత్తున భుజింప(
దీఱునే నాకు ఘనమైన దీపనంబు. (3-53)

శ్రీకృష్ణుడు భీమునివెంట హస్తినాపురికి ఏనుగులు గుఱ్ఱాలు బండ్లు దాసదాసీలు పౌర

జనంతో మహాసందడిగా బయలుదేరుతాడు. వెంట వచ్చే వృద్ధవేశ్యాజనాన్ని పుర స్కరించుకొని వారిద్దరికీ జరిగిన సంభాషణం చిత్తగించండి.

ఉ॥ వీరిఁ బరిగ్రహింపు మిదివేళ సమానలు నీకు భీషణా
కార కఠోరమన్మథ వికార గుణంబుల నన్ను నవ్వి య
మ్మారుతి పల్కె నిట్టి కొఱమాలినజంతలఁ జక్కఁబెట్ట నీ
భారము వన్నెకెక్కు దురవస్థలు నీ కరలాలనంబునన్ (3-63)

భీముని సమాధానం ఘాటుగాను ఉంది. శ్రీకృష్ణమాహాత్మ్యసూచకంగాను ఉంది. ప్రయాణానికి ముందు తనవెంటవచ్చే యశోదాదులకు ప్రద్యుమ్నాది కుమారులకు అక్కడ హస్తినాపురంలో ఉండే కుంతీదేవినీ అర్జునాదులనూ ఏట్లా గౌరవించాలెనో చెప్తూ పుష్కరాల గోదావరితో ఉపమించటం తెలుగువాళ్ళకు సంతోషం కలిగిస్తుంది.

ఉ॥ ఆ వనజాక్షుఁ డిట్లనియె నందఱు నెప్పుడు నప్రమత్తులై
సేవలు చేయఁగావలయు సింహబృహస్పతిఁ గూడుకొన్న గో
దావరిఁ జూచి తీర్థము లుదారతఁ దక్కినయట్లు మీరు గాం
డీవి పరాక్రమంబుగని నిల్వఁగ నేర్చిన పాటి భక్తితోన్ (3-80)

శాకుంతలంలో కణ్వాశ్రమ సాత్త్విక సంపత్తి వంటిదే జైమినిభారతంలో సౌబరి ఆశ్రమ సాత్త్విక సంపత్తి.

సీ॥ భేరుండములు ప్రక్కబెట్టి చన్నుల పూరి పాటించి శరభ
డింభముల కిచ్చు
శరభముల్ శయనించి హరికిశోరములను బొదుఁగుల పాలిచ్చి
నిదురపుచ్చు
సీనినసింగంబు లేని కలేఁజూళ్ళ గుడువ మైనాకుచుఁ గుస్తరించు
లేడి పిల్లలకు బాలెంత చివ్వంగులు పంకంబు లిచ్చుచుఁ బంచితిల్లుఁ

తే॥ బక్షములు గప్పి పసిపాప పాములకును
మేపులొసఁగి రక్షించు నెమిళ్ళ పిల్లు
లెలుక బోదలఁ బ్రోచుఁ జన్నిచ్చి యచటి
జంతు నివహంబు జాతివైషమ్య ముడిగి. (4-79)

జైమినిభారతంలో స్త్రీ మండల వృత్తాంతం వింతగా ఉంటుంది. ఇప్పుడు ఆ ప్రదేశం ఎక్కడుందో ! ఉన్నా పూర్వ ప్రాబల్యం దానికి ఈ నాడుందో లేదో. ఆ దేశంలో అంతా స్త్రీలే. అక్కడి ప్రత్యేకత ఏమంటే.

మ॥ సరసాలాప విలాస విభ్రమకళా సౌభాగ్యరేఖా మనో
హరకేళీపరిరంభణ క్రియల నాహ్లాదంబు పుట్టించి ని
ర్భరపుంప్రేమ వశీకరింపుదురు తద్భామాజనుల్ పాంథులన్
సురత ప్రౌఢి విహార వైభవములన్ జొక్కించి చిక్కించుచున్.
(5-107)

క॥ ఈ సరణి కామతంత్రా
భ్యాస పరిశ్రాంతి మిగులఁ బరవశమైనన్
నాశిలి ధాతుక్షయమై
మాసములోపలన వాఁడు మరణము వొందున్. (5-108)

తే॥ తోడగతి చేయుదురు వానితో రమించు
కాంతలందఱు నందోర్తు గర్భమైన
నిలుచు నమ్మానవతికి జన్మించెనేని
కొడుకు గానేరఁడెపుఁ డాఁడుఁబడుచుకాని (5-109)

అటువంటి స్త్రీ మండలానికి నాయకురాలు ప్రమీల. ఆమె యజ్ఞాశ్వాన్ని పట్టుకొంటుంది. అర్జునుడు యుద్ధానికి తలపడితే ప్రమీల ఇట్లా అంటుంది.

చ॥ కనుఁగొని నన్ను నాహవముఖంబున మార్కొని నిల్వ నీక కా
దనిమిష సిద్ధ సాధ్యులకునైన నసాధ్యము కార్యకాంక్ష నె
మ్మనమునఁ గల్గెనే దురభిమానము మాని ప్రియం బెలర్ప న
న్నెనసినవేడ్కతోడ వరియింపు హయంబుఁ బరిత్యజించెదన్.
(5-116)

తే॥ సోమపానంబు నీ యగ్రజుం డొనర్చి
యిష్టఫలభోగములఁ బొందనిమ్ము నీవు
నిట మదీయధరామృతం బెలమిఁ గ్రోలి
యువతిమండలమున కెల్ల నొడయఁ డగుము. (5-117)

అర్జునుడు కొంతసేపు ఎదురించి పోరాడుతాడేకాని గెలువడు. ఆకాశవాణి ఆదేశం ప్రకారం ప్రమీలకోరిక తీర్చి గుఱ్ఱాన్ని విడిపించుకొని పోతాడు. స్త్రీ మండలందాటి

యజ్ఞాశ్వం వృషదేశం ప్రవేశిస్తుంది. ఆ ప్రాంతమంతా బకాసురుని కొడుకు భీషణుని ఏలుబడిలో ఉంటుంది. ఆ దనుజపట్టణం బయట కొండగుహలో ఒక బ్రహ్మరాక్షసు డుంటాడు. ఆతని పేరు మేదోహోత. అతడు భీషణునికి పురోహితుడు కూడ. ఆతని వేషం భయంకరంగా ఉంటుంది.

సీ॥ అత యజ్ఞోపవీతాంత్ర గుచ్ఛంబులు వలలు నెత్తురు పట్టెవర్ధనంబు
మనుజకపాలాళిమాలికా వలయంబు చర్మకాషాయ వస్త్రద్వయంబుఁ
గరటి విస్ఫార కర్పరకమండులువును వ్రేలను గర్దపవిత్రకమును
గరమునందుఁ బురాణ కంకాళయష్టియు (5-129)

ఈ మేదోహోత ఆ పట్టణంలోని బ్రహ్మరాక్షసు లంతా చాతుర్మాస్యవ్రతం ముగించు కున్నారనీ, పార్థని బలాలను పారణ చేయటానికి అనుమతిమ్మనీ కోరుతాడు. వారు నెరపిన చాతుర్మాస్యం గమనింప దగింది.

సీ॥ జరిపిరి నియతి నాషాఢమాసంబున వరుసతో రుధిరాసవములు గ్రోలి
శ్రావణంబునఁ దపశ్చరణ ముగ్రంబుగా జలిపిరి మాచకమ్మలను మ్రింగి
చపలత్వముడిగి భాద్రపదంబునందు జపంబొనర్చిరి పాశుపతుల నమలి
నడవి రాశ్వయుజంబునను వ్రతంబులు బ్రహ్మచారుల విఱిచి భక్షణముచేసి

తే॥ నియమవిధులన్నియును దీర్చి నిష్ఠతోడఁ
గార్తికమున భుజించిరి కన్యకలను
గలరు నీవీట బ్రహ్మరాక్షసులు మఱియుఁ
గాలవంచకు లరయ నక్తంచరేంద్ర (5-131)

జైమినిభారతంలో ఆరో ఆశ్వాసమంతా కుశలవోపాఖ్యానమే. రామాజ్ఞ ప్రకారం లక్ష్మణుడు సీతమ్మను అడవిలో విడిచిపోతుంటే ఆమె పలికిన పలుకులు కరుణరస నిర్భరములు.

ఉ॥ దీక్షితుఁడైన కౌశికుఁడు దేరఁగనాఁడు వివాహవేళ నా
లక్షిత కాకపక్ష సమలంకృతమున్ నవరత్నకుండల
ప్రేక్షితమున్ సుధాకిరణబింబ నిభంబు విశాలపుండరీ
కాక్షమునైన రాముని ముఖాంబుజ మెన్నఁడు బాయ దాత్మలోన్ (6-72)

క॥ ననుఁబాసి విరహతాపముఁ
గొని తీఁగలఁ గౌఁగిలించుకొనెనఁట నేఁడ

వ్వనవల్లులలో న
న్నునిచెనఁట రాముఁ డేమనుదు దైవంబున్.

తే॥ అత్తలకుఁ గేలు మోడ్చితి ననపరాధ
పూర్ణగర్భిణి యని మనంబున గణింప
కడవిఁ ద్రోయించె నను రాముఁ డనుము చనుము
వత్స నిర్విఘ్నమగుఁగాక వర్త్మమనిన. (6-74)

పారిజాతాపహరణ కావ్యంలో శ్రీ కృష్ణుని అంతఃపురంలో రవరపలు పుట్టించి సత్యభామా గర్వభంగం చేయించిన నారదుని సంగతి ఆంధ్రపాఠకలోకానికి సుపరిచితం. ఆ నారదుడు జైమినిభారతంలో కూడ అటువంటి ప్రయత్నమే చేస్తాడు కాని ఇక్కడ మంత్రము పారదు. అటు ధర్మరాజుచేసే అశ్వమేధయాగానికి శ్రీకృష్ణుడు రుక్మిణీసహితుడై పోతాడు. ఇటు సత్యభామకు పురి ఎక్కించటానికై నారదుడు ఆమె అంతఃపురానికి పోతాడు.

శా॥ రాజన్యుల్ సకళతు్రలై యరగుదేరం జామరచ్ఛత్రవి
భ్రాజిష్ణుండగు కృష్ణుఁ గూడుకొని దాంపత్యంబునన్ రుక్మిణీ
రాజీవానన యేఁగ నీచనవు వ్యర్థంబయ్యెఁ బొమ్మన్న స
త్రాజిత్పుత్రి యనున్ దనున్మఱచునే ప్రాణేశ్వరుం డయ్యెడన్.
(8-180)

క॥ అని తనకేళీ సౌధం
బుననున్న మురారిఁజూప మునివిస్మితుఁడై
వనజోదరుఁ డెయ్యెడలేఁ
డని కొనియాడుచు నిజేచ్ఛ నరిగెన్ బిదపన్. (8-181)

అశ్వమేధం ముగిసిన తరువాత భోజన సంతర్పణం జరుగుతుంది. అప్పుడు భీముడు ప్రదర్శించిన పాకశాస్త్ర నైపుణ్యం చూడండి.

క॥ బిరుసింతగాక నడిమికి
మురియక నున్నబాయివడి చిముడఁబాఱక యే
బెరికియును లేక మిక్కిలి
గరగరనగు నేఱుప్రాల కలమాన్నంబుల్. (8-199)

చ॥ సరములరీతిఁ గ్రొన్నెలలజాతి బిసంబులభాతిఁ బద్మకే
సరములభంగిఁ దారకల సంగతిఁ దార్పుల మాడ్కిఁ బుష్పమం

జరుల విధంబునన్ మణుల చాడ్పునఁ బెక్కులు గంధతైలపా
కరచితముల్ విచిత్రములు కమ్మని సైఁదపుఁ బిండివంటలన్ (8-190)

కొందరబ్జముఖులు తీరుతీరు పదార్థాలు వడ్డిస్తుంటే అటువంటివెన్న డూ తినని తాపసులు అడిగే ప్రశ్నలకు వడ్డించేవారు చెప్పే సమాధానాలు వినండి.

సీ॥ చింపి వల్కలము లేమి చేసెడిదనఁగావు నెఱవైన కండమండెఁగలు గాని
తెగిన జందెము లేల తెచ్చెదరనఁ గావు వినుఁడివి సన్నసేవియలు గాని
యౌదుంబరముల లనర్ఘము లొల్లమనఁ రావు నమలి చూడుఁడు
మోదకములు గాని
ఫేనపుంజములేల పెట్టెదరనఁ గావు నీ పాదమాన ఫేనికలు గాని

తే॥ యంచు వాచంయములు వల్క నబ్జముఖులు
నగుచు నొడఁబడఁ జెప్ప నందఱు యథేష్ట
రుచుల భుజించి వార్చి కర్పూర వీటి
కా సుగంధప్రసూన సౌఖ్యములఁ దనికి. (8-204)

పిల్లలమర్రి పినవీరనగారి నుడికారానికి సామెతలకు పద్యరచనా శిల్పానికి 'రీతి'కి ఇంకొక అవకాశం తీసుకుంటాను. ఈ కావ్యఫల శ్రుతితో ఈ ప్రసంగం ముగిస్తాను.

మ॥ అనువారంబు నజాతశత్రుహయ మేధారంభమున్ యౌవనా
శ్వనృపాలాది మహీశ వర్ణనములున్ సద్భక్తిఁ బాటించి వి
న్నను రామాయణ భారత శ్రవణకన్యా గోసహస్ర క్షమా
ధనదానాధిక పుణ్యముల్ దొరకు మర్త్యశ్రేణి కశ్రాంతమున్.

---

## పినవీరన గురించి తప్పక చదువదగినవి

1) సమగ్రాంధ్ర సాహిత్య చరిత్ర — శ్రీ ఆరుద్ర
2) పిల్లలమర్రి పినవీరభద్రకవి — Dr. జి.వి. సుబ్రహ్మణ్యం
3) సాహిత్య కౌముది — శ్రీ గుంటూరు శేషేంద్రశర్మ
4) శారదా పీఠము — Dr. యస్వీ జోగారావు
5) శృంగార శాకుంతలము A.P.B.D. పీఠిక — శ్రీబొమ్మకంటి శ్రీనివాసచార్యులు
6) శృంగార శాకుంతలము A.P.S. పీఠిక — Dr. నాయని కృష్ణకుమారి

# గుర్రం జాషువా

## -ఆచార్య సి.నారాయణరెడ్డి

'రాజు మరణించె నొక తార రాలిపోయె
కవియు మరణించె నొకతార గగనమెక్కె
రాజు జీవించె రాతి విగ్రహములందు
సుకవి జీవించె ప్రజల నాలుకలయందు'.

జాషువా సుకవి. అతని వ్యక్తిత్వం సంస్కార ప్రియుల హృదయాల్లో జీవిస్తున్నది. అతని కవితావక్తృత్వము ప్రజలనాలుకల్లో జీవిస్తున్నది. అసమసమాజం బాకులు గుమ్మినప్పుడు, అంటరానితనం విషాగ్నులు చిమ్మినప్పుడు, దుర్భర దారిద్ర్యం వెన్నాడినప్పుడు, దురంత వేదన గుండెల్లో తుకతుక ఉడికినప్పుడు జాషువా గుర్తొస్తారు. అతని 'ఫిరదౌసి' గుర్తొస్తుంది. 'గబ్బిలం' జ్ఞాపకానికి వస్తుంది. 'శ్మశానవాటి' నిట్టూర్పు పొగలతో కట్టెదుట నిలబడుతుంది. ఇంకాఇంకా ఎన్నెన్నో ఖండకృతులు ప్రతిఘటనకు ఓంకృతులై ప్రతిధ్వనిస్తాయి.

జాషువా కవిత్వాన్ని అతని వ్యక్తిత్వంనుంచి విడదీసి చూడలేము. అవి ఒకదానికొకటి కారకాలు, ఉపస్కారకాలు. అవిభాజ్యంగా కలిసిమండిన అనల జ్వాలలు.

బాల్యంలో తన ఊళ్లో నాటకం చూద్దామని టిక్కెట్టు కొనబోతూ ఉంటే "నీవు అంటరానివాడివి, రాకూడద"ని ఈసడింపబడినప్పుడు, తెలుగుభాష మీద మక్కువతో పురాణేతిహాసాలు చదువుతూ ఉంటే, "జాషువా హిందువైపోతున్నాడ"ని స్వమతస్థులు సీత్కరించి నప్పుడు, కొప్పరపుకవుల అవధానం విని తాను వ్రాసిన అభినందన పద్యాలను వేదికపైనుంచి వినిపించాలనే కుతూహలాన్ని "అంత్యవర్ణుడు సభలో ప్రవేశార్హుడుకాడ"ని అన్యవర్ణాల వారు తృణీకరించినప్పుడు, అటు హిందువులూ ఇటు క్రైస్తవులు విడివిడిగా తనను వెలివేసినప్పుడు, పాడువడ్డ మసీదే పాఠశాలగా, గుడ్డిదీపమే గురువుగా భారతభాగవతాలు తాను చదువుకున్నప్పుడు, సాలీళ్లు, గిజిగాళ్లు,

గబ్బిలాలు, కముజులు, తన నేస్తగాళ్లై కన్నీళ్లతుడిచినప్పుడు, జాషువా తరుణ హృద యంలో చెలరేగిన ఒక్కొక్క వేదవాస్ఫులింగం ఒక్కొక్క ఖండకృతిగా రూపొం దింది. జాషువా కవితకు ఊపిరి అతని శ్వాసకోశాలు ఎగజిమ్మిన ఆవిరి.

కవితకు ప్రభుత చేసిన అన్యాయం పిరదౌసిలోని ఇతివృత్తం అస్పృశ్యుని ఆత్మఘోష 'గబ్బిలాని'కి అంతరంగం. సమతా దృక్పథం 'శ్మశానవాటి'కి నేపథ్య రంగం. [1] ఇలా అతని లఘుకృతులూ, ఖండకృతులూ, ప్రాయికంగా స్వానుభూతు లకు ఆమ్రేడితాలే.

## కవికోకిల :

జాషువాకున్న ఎన్నో బిరుదుల్లో 'కవికోకిల' ఒకటి. అన్ని బిరుదుల్లోనూ అన్వ ర్థంగా నిలిచిపోయింది ఇదే.

చిలక ఫలరసాలను ఆస్వాదిస్తుంది. అంత తియ్యగానూ పలుకుతుంది. తుమ్మెద పూలతేనెలను గ్రోలుతుంది. అంతకమ్మగానూ ఝుంకరిస్తుంది. మరి కోకిల, ఫలాలను ముట్టదు. పూలను తాకదు. కొమ్మలమాటున ఉంటుంది. ఒగరు చిగుళ్ళను మేస్తుంది. అవ్యక్తమధురిమలను సంతరించుకున్న కుహూగీతం వినిపిస్తుంది. చిలక పలుకు చెట్టుదాటదు. తుమ్మెదరొద తోట దాటదు. కోకిల కుహూనాదం కోనదాటి, కొండదాటి, కోటదాటి, పేటదాటి విశ్వాంతరాళంలో మారు మ్రోగుతుంది.

జాషువా అంటే అజ్ఞాతుడుగా, అనాదృతుడుగా, సంఘం మాటున బ్రతికాడు. చేదుబాధల చిగుళ్ళను మేసి స్వాదుకవితలు ఆలపించాడు. వినుకొండదాటి, గుంటూరు దాటి, సమస్తాంధ్రం అంచులుమీటి ఎక్కడెక్కడ తెలుగుందో ఎక్కడెక్కడ ఆశ్రు సిక్తమైన కనువెలుగుందో అక్కడిదాకా జాషువా కలగీతం పయనించింది. అందుకే జాషువా కవికోకిల. తీయగా పలికినందుకూ కాదు. 'పంచమస్వర' సామ్యాన్నిబట్టి కొందరు భంగ్యంతరంగా ఊహించినందుకూ కాదు.

## కవితాదృక్పథం :

వరకవీంద్రుని కవిత్వం ఎలాఉంటుందో చెప్పిన పద్యంలో జాషువా కవితా దృక్పథం ధ్వనిస్తున్నది. ఆ దృక్పథమే జాషువా కవితా స్వరూపానికి అక్షరాలా వర్తిస్తుంది.

---

1) ఇట నస్పృశ్యత సంచరించుటకు తావేలేదు - శ్మశానవాటిక-ఖండకావ్యము.

మదమరాళంబుల కుదురైన నడకలో
రాణించు సహజంబు రాజసంబు
కదను ద్రొక్కు గుఱ్ఱాల గర్వంపుమెడలవం
పులనుట్టిపడు కులుకుల పసందు
నెలకూనలంటని నిండుజవ్వని కుచ
ద్వయి నేలు వలరాచవాని బిగువు
కలికి గులాబి మొగ్గలమీది విశ్వమో
హనమైన సున్నితమైన మెదుపు
మధురరసమును గడుపున మాటుకొన్న
ద్రాక్షఫలగుచ్ఛముల యందముల తూగు
వరకవీంద్రుని కావ్యప్రపంచమందు
ప్రతిపదంబున మదికి దర్శనమొసంగు. [2]

ఈ పద్యంలో ఉత్తమ కవిత్వానికి ఉండవలసిన సమగతి, వక్రోక్తి, ప్రౌఢి, మార్దవం, మాధుర్యం సూచింపబడ్డాయి. శ్రీనాథుడు భీమఖండం అవతారికలో ఇలాంటి అభిప్రాయాలనే ప్రకటించాడు.

హరచూడా హరిణాంక వక్రతయు, కాలాంతస్ఫురచ్చండికా
పరుషోద్గాఢ పయోధరస్ఫుటతటీ పర్యంత కాఠిన్యమున్
సరసత్వంబును సంభవించెననగా సత్కావ్యముల్ దిక్కులం
జిరకాలంబు నటించుచుండు కవిరాజీ గేహ రంగంబులన్.

శ్రీనాథుని వక్రత జాషువా సూచించిన కదను దొక్కె గుర్రాల మెడల వంపుల్లో ఉంది. వంపు అంటే వక్రతే కదా! శ్రీనాథుడు తెలిపిన పయోధరకాఠిన్యం జాషువా సూచించిన 'కుచద్వయి బిగువు' లో ఉంది. ఈ కాఠిన్యం ప్రౌఢికి రూపాంతరం. శ్రీనాథుడు ప్రకటించిన సరసత్వాన్ని జాషువా 'మధుర రసం'గా రూపొందించాడు. కవితా లక్షణ నిర్దేశంలో శ్రీనాథునికీ, ఈ అభినవకవినాథునికీ ఎంతో సాదృశ్యం ఉంది. పద్యం నడకలోగూడా శ్రీనాథునిముద్ర జాషువాపై నిర్భిద్రంగా ఉంది. గల గలపారే మాటల గొలుసులమధ్య, ప్రౌఢతా నిర్భరంగా సాగే సమాసాలమధ్య, పాద మధ్యంలో, ప్రాయికంగా యతిస్థానంలో చిన్న సంబోధన విసరడం ఇద్దరికీ అజాన

2) ఖండకావ్యము-2.

జంగా అలవడిన అలంక్రియలు. అతడు "పక్షి సేయుదాక్షిణ్యమున్" అని అంటే ఇతడు "తబిసిపిట్టా నీకు మేలయ్యేడున్" అంటాడు. 'ధక్కామల్లు పసందు' వంటి శార్దూలాలు, 'ఆకాశరామ నీల్లాడు' చక్కదనాల వంటి సీసాలు జాషువా శ్రీనాథుని మూసలో పోసి తీసినదే! అరబ్బీఫారసీకపదాలు, ఉర్దూ మాటలు విరివిగా ప్రయోగించడంలోనూ ఈ కవులిద్దరూ కవలబిడ్డలే! అసలు ప్రాచీనాంధ్రసాహిత్యంలో శ్రీనాథుడు ప్రయోగించినన్ని అన్యదేశ్యాలు (అరబ్బి-ఫారసీ, ఉర్దూ) మరెవ్వరూ ప్రయోగించలేదు. గుల్లాము (గులాం-బానిస), కుల్లా (కులాహ్-టోపి), హజారము (హజ్రా-ఆస్థానం), కుందనము (కుందన్-బంగారము), ఖుసి (ఖుషి-సంతోషం) ఇత్యాదులు. ఇలాంటి అన్యదేశ్యాలు శ్రీనాథుని కృతుల్లో యాభైకిపైగా దొరుకుతాయి. జాషువాలాగా పుంఖానుపుంఖంగా ఉర్దూ, ఫారసీక పదాలను ప్రయోగించినవారు లేరు. అవి కేవలం ప్రయోగ వైచిత్రికోసం స్వీకరించినవి కావు. జనంలో నలిగిపోయినవే. వ్యవహారంలో అనునిత్యం ఎదురుపడేవే. కుమ్మక్కు (కుమ్మక్-సహాయం) నగిషీ (నక్ష్-అలంకరణ), హయాం (అయ్యాం-దినాలు రోజులు) గలభా (ఘల్బా-గొడవ) పురమాయించి (ఫర్మానా-సెలవిచ్చుట), ఇంకా షరాబు, కులాస, నసీబు, తయారు, ముస్తాబు, మామూలు, దర్జా, ధీమా, పసందు, కోనకిస్కాగాడు వంటి ప్రయోగాలు జాషువా కవితలో కోకొల్లలుగా దొరకుతాయి.

స్వమతస్థులూ, అన్యమతస్థులూ, తనను నిరసించినప్పుడు, జాషువా సాయెబులపంచలో కొన్నాళ్ళు గడిపాడట. ఈ ఉర్దూపదాల ముమ్మరం ఆ సహవాస ఫలితమని కూడా అనుకోవచ్చు.

వ్యవహారంలో ఉన్న పదాలు ఏ భాషవైనా కావచ్చు; స్వేచ్ఛగా కావ్యాలలో ప్రయోగించాలన్న ఆధునిక దృక్పథాన్ని జాషువా ఏనాడో సమర్థించాడు. తాను ఛందోబద్ధంగా పద్యాలు వ్రాసినా, భాషా విషయికంగా వ్యావహారిక పదప్రయోగానికి బాసటగా నిలబడ్డాడు. ఛందోనిబంధనలను కొంతకు కొంత సడలించాలన్నాడు 'క్ష' కూ 'ష' కారానికి యతిలేదన్న వారిని నిశితంగా విమర్శించాడు. సంఘ సంస్కరణ రంగంలో కందుకూరి వీరేశలింగంగారికి కైమోడ్పులు ఘటిస్తూనే అతడు తన ఆంధ్ర కవుల చరిత్రలో ప్రజాకవి వేమన్నను చేర్చకపోవడాన్ని నిరసించాడు. మారుమూలపల్లెల్లో అణగి మణిగి ఉన్న తెలుగు నుడులను సమాదరించని పండితమ్మన్యులను పరిహసించాడు.

వ్యవహారంబున భ్రష్టమయ్యె రసభావస్ఫూర్తి కల్పించి మా
ర్దవముల్ శబ్దములెన్నియో కలుగ, శాస్త్రజ్ఞానమాత్రుల్ పురా
కవితోన్మత్తు లెరుంగ జాలుదురె కుగ్రామీణ భాషాబ్ధిలో
చవులూరించు తెలుంగు పల్కుల జగా స్వారస్య రహస్యమున్.

కవిత్వం భువనహితం కోరేదిగా ఉండాలని జాషువా విశ్వాసం. రాజుల భోగ వర్ణనలు, విరహిణుల అంగాంగ వర్ణనలు అతనికి గిట్టవు.

ప్రభువుల పెండ్లి పేరంటాలు వర్ణించి
కాలంబు పెక్కేండ్లు ఖర్చుపెట్టి
విరహవేదన మేనుమరచి మూర్ఛలువోవు
రాణివాసంబును రచ్చకీడ్చి
అంగాంగ వర్ణనావ్యసనంబు రెట్టింప
యువక జీవితకోటి కుచ్చులొడ్డి
పదియు నెన్మిదిమార్లు పాడిన శ్రీరాము
చరితంబు వగరెక్క తిరుగబాడి

శరణు శరణటంచు పరుగునెత్తుచు వచ్చు
ఆర్తలోక రుత మనాదరించి
భువనహితముగోరు కవితా కళాశక్తి
స్వార్థజలధి నూరవైచినారు.

## భావకవితానిరసనం :

జాషువా భావకవితాయుగం మహోజ్జ్వలంగా వెలుగుతున్న రోజుల్లో తలఎత్తిన కవి. భావకవిత్వాన్ని ప్రణయ కవిత్వానికి పర్యాయంగా చాలామంది వ్యాఖ్యానిస్తూ ఉంటారు. అది తప్పు. భావకవిత్వ భూరుహానికి శాఖలెన్నో! ప్రణయ కవిత్వం, ప్రకృతి కవిత్వం, దేశాభిమాన కవిత్వం, సంఘసంస్కరణ కవిత్వం, భక్తికవిత్వం, స్మృతి గీతాలు వగైరా. అయితే భావకవిత్వం ఇంత శాఖా బహుళంగా విస్తరించినా, ప్రణయకవితా శాఖ అన్నిటినీ తలదన్నినట్లు ప్రసరించింది. ఫలించింది. అందువల్ల స్థూలదృష్టికి భావకవులంటే ఊహాంబర విహారులూ, అందని ప్రేయసికై అఱ్ఱులు సాచే స్వప్నసంచారులుగానే గోచరించారు. జాషువా దేశాభిమాన కవిత్వం. సంఘ

సంస్కరణ కవిత్వం వెలయించినా ప్రణయ కవిత్వంవైపు పోలేదు; 'సఖి' వంటి ఒకటి రెండు ఖండకృతుల్లో తప్ప, నిష్ఠుర జీవితసత్యాలనే కన్నీట తడిసిన కరకు పాళీతో చిత్రించాడు. కంటికి కనిపించిన వాస్తవాలనే ప్రవచించాడు. ఊహాప్రేయసీ వర్ణనను నిరసించాడు.

కమ్మని భావముగల ప
ద్యమ్మొక్కటి వ్రాయజాల; వన్నిటిలో "ము
గ్ధమ్మో ! ప్రణయమ్మో !" యని
యుమ్మలికించెదవు నీదియుం గవనంబా ?

కవిసమయంబును తప్పి నుడికారపు సొంపును పాడుచేసి, నీ
వెవతుక కోసమో ! కుమిలి యేడ్చుచు చక్కని తెల్గుకైతకా
యువులు కుదించి, యేమిటి కయోమయంబొనరింతు వీవు ! నీ
కవనము పాడుగాను వెడగా ! యికనేనియు రమ్ము దారికిన్.

'సాలీడు' లో కూడ కళల పరమార్థం కేవలం అందమే కాదనీ, నలుగురికి ఉపయోగపడని జిలుగు నగిషీలు వ్యర్థమనీ అభిప్రాయ పడ్డాడు.

ఢక్కామల్లు పసందు నేత పనివాండ్రా, నీయుపాధ్యాయు ? లి
ప్డొక్కండున్ కనరాడు, డాగుకొనినారో! నీదుగర్భంబునం
దిక్కాలంబున నిన్ను మించు పనివాడే లేడు, దుర్వృత్తికిన్
దిక్కైనీ అసమానకౌశలము వ్యర్థీభూతమై పోయెడున్.

పదాల పొందికలో కూడా పొదుపును పాటించాడు. శ్రీనాథుని కవితా లక్షణాలను ఎన్నిటినో చిక్క బట్టుకున్నా: అతడు చేసినట్లు 'అంభోజపత్రదీర్ఘాయతాక్షి' వంటి అనవసర సమాసాడంబరంవైపు మొగ్గు చూపలేదు. తోచినంతలో తూచివేయడం, నొక్కి చెప్పవలసి వచ్చినప్పుడు చేయిసాచి వేయడం జాషువా పదప్రయోగ విశిష్టతలు. ఆ ఒరవడిలో ప్రాదెలుగుపలుకుబళ్లు కరళ్లు కరళ్లుగా దొరలుతాయి. తన నాటి నుడికారాలు తళుక్కు మంటాయి. పరాయి భాషాపదాలు పల్లటీలు కొడతాయి.

## నిసర్గశైలి :

కొందరు కవులు వర్ణ్యవస్తువును చిత్రించడానికి ఉల్లేఖాలనూ, ఉత్ప్రేక్షా పరంపరలనూ ఆశ్రయిస్తారు. ఒకే అభిప్రాయాన్ని భావచిత్రతోరణాలతో రకరకాలుగా

అలంకరిస్తారు. కేవలం సౌందర్య ప్రతిపాదనకు ఈ శైలి, ఈ రీతి ఉపయుక్తంగానే ఉంటాయి. కాని ఒక సందేశాన్ని ఆవేశాత్మకంగా చెప్పేటప్పుడు ఇవే ప్రతిబంధకాలుగా పరిణమిస్తాయి. జాషువాకు పద్యాన్ని చిత్రిక పట్టడం తెలుసు. భావాన్ని చిత్రచిత్రాలుగా కూర్చడమూ తెలుసు. కాని ఎప్పుడోతప్ప అత డీదారి తొక్కలేదు. సూటిగా సెలయేటి. ధాటిగా, వాడిగా, రసావేశజీవనాడిగా కవితలు చెప్పడం అలవరచుకున్నాడు. అతని కవిత్వానికి ఆవేశం జీవం. అసలు ఏ కళకైనా రసావేశమే ప్రాణసదృశ్యం. అందుకే జర్మను మహాకవి గెథే అన్నాడు. "True art cannot exist without emotion" అని. ఈ రసావేశం లేనివాళ్లు బుర్రతో చూస్తారు, బుద్ధితో రాస్తారు. జాషువా అనుభూతితో చూస్తాడు. ఆవేశంతో రాస్తాడు. ఆ ఆవేశాన్ని వెల్లువలా కాకుండా పిల్లకాల్వల్లా పారిస్తాడు. ప్రణాళికాబద్ధంగా ప్రవహించే రసావేశమే ఉత్తమకవిత్వాన్ని సృష్టించగలుగుతుంది.

థామస్ హార్డీ "Poetry is emotion put into measure" అన్న నిర్వచనానికి పరమార్థం ఇదే.

జాషువా రసావేశానికి 'ఫిరదౌసి' 'ముంటాజమహల్' 'గబ్బిలము' 'శ్మశానవాటి' వంటి అనేక కృతులు ప్రత్యక్షరాకృతులు. ఈ దృష్టికలవాడు కాబట్టే ఆవేశాన్ని విరిచేసే శ్లేషలజోలికి యమకాలపాలికి పోలేదు. పోయిన ఒకటి రెండు సందర్భాలు కూడా భావనారమ్యంగానే ఉన్నాయి.

శ్లేషను తమాషాగా ప్రయోగించిన సందర్భం :-

జీర్ణదేవాలయముల వసించుకతన<br>
కటికచీకటిలోని చక్కనిగుణంబు<br>
అవగతము చేసికొన్న దివాంధమొకటి<br>
పగలు వలదని శ్లేషగా పలకసాగె.

పగలు అంటే దినమనీ పగలంటే విరోధాలనీ స్పష్టం.

అలాగే ఏకా అంజనేయులను గూర్చి వ్రాసిన నక్షత్రమాలలో యమకక్రీడకు లోనైనాడు.

ఏకాయన నిర్వురుగా<br>
రేకాయన నొక్కడే యదెట్లనగ కళా<br>
లోకాయు స్సౌధంబున<br>
కేకైక స్తంభమొక్క యేకాయేకా!

"ఏకాయేకా" అంటే ఏకాయే + కా, కాఅంటే ఏకా ఒక్కదేకదా అని.

## కరుణవీరం:

కరుణరసాన్ని వరించిన కవి జాషువా. "ఈనాడు రచింతు; రిద్ధకరుణాపరిణద్ధ రసప్రబంధముల్" అని స్పష్టంగా కరుణరస ప్రాధాన్యాన్ని ప్రకటించారు. కరుణరసంతోపాటు, వీరరసాన్నీ జాషువా స్వీకరించాడు. స్థూలంగాచూస్తే జాషువా రచనల్లో కరుణం అంగిరసంగా, వీరం అంగరసాల్లో ఒకటిగా భాసిస్తాయి. కాని ఈరకమైన సంప్రదాయసిద్ధమైన రససిద్ధాంతాల కొలమానాలతో కొలిచి చూస్తే జాషువా కవితా విశిష్టత అందదు. అతని రసదృష్టిని విలక్షణ దృష్టితోనే చూడాలి. నీరు గార్చేకరుణమో; నిప్పుగక్కే వీరమో మాత్రమేకాదు. ఈ రెంటి కలయికతో రూపొందిన ఒక విపూత్న రసదృక్పథం నాదృష్టికి భాసమానమౌతున్నది. జాషువా కేవల కరుణరసైక కవికాదు; కేవలవీరరసైక కవికాదు. ఇలా అన్నంతమాత్రాన ఇతని కవిత్వం కరుణ+వీర ఉభయరసాల సముచిత సమ్మేళనం అనీ అనుకోరాదు. ఇతని కృతుల్లో ప్రముఖంగా ప్రజ్వరిల్లేరసం 'కరుణవీరం'

కరుణం శోకమూలకం, వీరం ఉత్సాహమూలకం. శోకం ఆశానిహతివల్ల ఏర్పడుతుంది. ఉత్సాహం ఆశాప్రగతివల్ల పొంగులెత్తుతుంది. జాషువా కవిత్వల చిందించే కరుణరసం ఉత్త కన్నీళ్ళదికాదు. ఉప్పెనలను దాచుకున్నది. జాలితో జావగారేదీ కాదు. జ్వాలలను ఎదలో ముడుచుకున్నది. అది ప్రార్థనాత్మకమైనదికాదు. ప్రతిఘటన పూర్వకమైనది.

వీరరసం త్రివిధమని తొలుత భరతుడు ప్రతిపాదించాడు, దానవీరం, యుద్ధవీరం, ధర్మవీరం, రానురాను రసగంగాధరకారుని చేతిలో ఈ వీరం ఎనిమిది తలకాయలతో ఎదిగింది. అచ్యుతరాయల 'సాహిత్యసార' గ్రంథంలో ఏకవింశతి రూపాలుగా అవతరించింది. కళావీరం, కవిత్వవీరం, రూపవీరం, సంపద్వీరం, జ్ఞానవీరం- అంతేనామరి; గానవీరం. ఈ రకంగా ప్రాచీనలాక్షణికుల దృష్టిలో వీరరసం ఇన్నిన్ని రూపాలు ధరించింది. ఒక్కొక్కభావం ఉత్కటత్వాన్నిబట్టి ఒక్కొక్క వీరరస భేదం నిర్దేశింపబడింది. నిజానికి కళావీరం అన్న ఒక్కమాటలో కవితావీరం ఉంది. గానవీరంకూడా ఉంది. జ్ఞానవీరంకూడా ఇమిడిపోతుంది. తర్కశక్తిమూలకంగా ఏర్పడిన ప్రభేదాలివి. పెంచుకుంటూపోతే ఎన్ని వీరాలకైనా అవకాశం ఉంటుంది. ఓట్లకాలంలో ఎంతకూ మైకునువదలకుండా గంటలకొద్దీ ఉపన్యసించే వక్తది ఉప

న్యాసపీఠంకాదా? బడిగంట మోగినా తరగతిలో పాఠప్రవచన కొనసాగించే పంతులు గారిది పాఠనపీఠం కదామరి? అది అలా ఉండనీయండి.

జాషువా కరుణరసంలోనుంచి వీరరసాన్ని పొంగించినకవి. అతడు చిందించే కన్నీళ్ళు అగ్నిగోళాలు. అవి దేబరించేవికావు. గూబలను గుద్ది పలకరించేవి.

కరుణరసమొకండె కఠిన రాక్షసముల్
హృదయములను గలచి ముదము గూర్చు
వేడికంటి నీటివిలువ సహజమైన
చలువలీను అశ్రువులకు లేదు. [1]

జాషువా కృతుల్లోని కరుణవీరానికి కీలకమూ, మూలకము అయిన పద్యమిది. కన్నీళ్ళలో కణకణమండే స్ఫులింగాలను పొదుగుకున్న కవి కాబట్టే—

"కఠినచిత్తుల దురాగతములు ఖండించి
కనికార మొలకించు కలము నాది"

అని గర్జించగలిగాడు.

"నిమ్నజాతుల కన్నీటిసీరదములు
పిడుగులై దేశమును కాల్చివేయునని"

హెచ్చరించగలిగాడు. కార్చే కన్నీళ్ళను దర్శించడం అంటే కరుణవీర రససిద్ధాంతానికి ప్రాతిపదిక వేయడమే కదా! 'గబ్బిలము'లోని

"వాని తలమీద పులిమిన పంకిలమును
కడిగి కరుణింప లేదయ్యె గగనగంగ
వాని నైవేద్యమున అంటువడిన నాడు
మూడు మూర్తులకును గూడ కూడులేదు."

అన్న పద్యంలోనూ నిర్వేదంతో కూడిన ప్రతిబోధమే వెల్లి విరుస్తున్నది. అస్పృశ్యుడు పండించిన ధాన్యమే కదా ఆలయంలో సమర్పించే నైవేద్యం? అంటారని వాని ధాన్యాన్ని అంటుకోమని ఆ దేవతలే అనుకుంటే వాళ్ళకు కూడు లేదు. పూజార్లకు నీడ లేదు.

1) ముసాఫర్

ప్రతిమల పెండ్లి సేయుటకు వందలు వేలు వ్యయించు గాని దుః
ఖితమతులైన పేదల ఫకీరుల శూన్యములైన పాత్రలన్
మెతుకు విదల్ప దీభరతమేదిని ; ముప్పదిమూడు కోట్ల దే
వత లెగవడ్డ దేశమున భాగ్యవిహీనుల క్షుత్తులాఱునే.

అన్నపద్యంలోనూ ఈ ప్రతిఘటనమే రెక్క విప్పింది. కరుణరసానికి సంచారి భావాలు దైన్యం,గ్లాని,జడత,చింత నిర్వేదం మొదలైనవి. వీరరసానికి సంచారి భావాలు అమర్షం, క్రోధం, వితర్కం, ఆవేశం, ఉగ్రత మొదలైనవి. జాషువాకృతుల్లో గోచరించే కరుణవీరం ఏకకాలంలో దైన్యాన్ని, ప్రబోధాన్ని నిర్వేదాన్ని, క్రోధాన్ని, జడతను, ఉగ్రతను చింతనూ, అమర్షాన్ని - ప్రత్యక్షీకరిస్తుంది. అభ్యుదయ కవిత్వం లోనూ కరుణవీర ప్రతిపాదనమే ప్రముఖంగా కనిపిస్తుంది. ఇందుకు ఆద్యుడు జాషువా. 'కరుణవీరం' అనే వినూత్న వీర రసభేదాన్ని నేను ప్రతిపాదించడానికి స్ఫూర్తిని కలిగించింది జాషువా కవిత్వమే !

## సంఘ సంస్కారణం

కలాన్ని కులంతో కొలిచే మనస్తత్వాన్ని జాషువా గర్హించాడు. చాతుర్వర్ణ్య వ్యవస్థా మూలాన్ని కుదిలిస్తూ ఇలా అంటాడు.

ముసలివాడైన బ్రహ్మకు పుట్టినారు
నలువురు కుమారు లనుట విన్నాముగాని
పసరమునకన్న హీను డభాగ్యుడైన
యైదవ కులస్థు డెవ్వరమ్మా ! సవిత్రి!

అసలు నాలుగువర్ణాల విభజనమే ఆధునికకాలంలో అర్థంలేనిది. అందులో ఐదవ కులమేమిటి? ఆ కులం అంటరానిది కావడమేమిటి? ఎవరు దీనిని సృష్టించారు? భారతీయులు ఎందుకు దీన్ని ఇంకా అనుసరిస్తున్నారు? ప్రశ్నలు! ప్రశ్నలు! ప్రశ్నలు! జాషువా గుండెలో మొలకెత్తిన ప్రశ్నలివి. భారతంవంటి ఇతిహాసంలో కుమారాస్త్ర విద్యా సందర్శన ఘట్టంలో పరమతేజస్వియైన. శరపాండితీధురంధరుడైన కర్ణుడికి పట్టిన దుర్గతే తనది. ఆ ఘట్టంలో కర్ణుని కదనపాండితిని కులంతో కొలిచారు, తన జీవితంలోని తొలిఘట్టంలోనూ జాషువా కవనప్రతిభను వర్గాల పడికట్టురాళ్ళతో తూచారు. ఆనాడు కర్ణుడికీ, ఈనాటి జాషువాకు ఎదురైన పరాభవం ఒక్కటే. అందుకే కర్ణుని వ్యక్తిత్వంతో జాషువాకు సాన్నిహిత్యం ఏర్పడింది. 'కర్ణుండేమాయె

కులపరీక్షకుల నడుమ?' అని ప్రశ్నించే మనస్తత్వం పొడచూపింది. కర్ణునితో తన కున్న తాదాత్మ్యాన్ని ఈ కవి స్పష్టంగా చెప్పుకున్నాడు.

> నీ పేరెత్తిన నామనఃకుహరమంధీభూతమై, క్షుబ్ధమై
> వాపోవున్; తనువెల్ల కంచుకితమై వ్యాలోలమై పొల్చు, గ
> ర్ణా! పౌరందరు దేయు బాణముల యన్యాయ ధ్వనుల్ నా చెవిన్
> రా పాడున్ కఠినంబులై; మన విచిత్ర స్నేహ మూహించితే?

కురుకుమారుల సభలో ఆ సూతపుత్రునికి జరిగిన అవమానమే అనేక కవితా సదస్సుల్లో తనకు జరుగుతూ వచ్చింది. సూర్యారాయమహీపతిని సందర్శించినప్పుడు చెప్పిన పద్యంలో జాషువా ఆత్మవేదన అసిధారా సదృశంగా వ్యక్తమౌతున్నది.

> నా కవితావధూటి వదనంబు నెగాదిగ జూచి, రూప రే
> ఖా కమనీయ వైఖరులు గాంచి "భళీభళి!" యన్నవాడే "మీ
> దేకుల" మన్న ప్రశ్న వెలయించి, చివుక్కున లేచిపోవుచో
> బాకున గ్రుమ్మినట్లగును పార్థివ చంద్ర! వచింప సిగ్గగున్.

కవిత్వంకోసం కవిత్వం వ్రాసే ప్రవృత్తి కాదీ కవిది. సంఘటనలు తన గుండెను చీల్చినప్పుడు, సంఘానికి ఎదురు తిరిగి సవాలు చేశాడు అన్యాయాలకు అంతమెప్పు డని ఆక్రోశించాడు. కుల మత వ్యవస్థను కూకటివేళ్లతో పెల్లగించాలని కలాన్ని గునపంగా ప్రయోగించాడు, ఆకలినీ, శోకాన్నీ నిర్మూలించే వినూత్న వ్యవస్థకోసం అర్రుసాచాడు. సంఘమే రణరంగంగా, సంస్కరణమే చరమ లక్ష్యంగా పరిక్రమించాడు. ఈ సంఘ సంస్కరణాభిలాష ఇతని కవిత్వంలో చతుర్ముఖాలుగా సాగింది. 1. మత వైషమ్య నిరసనం, 2 అస్పృశ్యతా నిరసనం, 3. అంధ విశ్వాస నిరసనం, 4. దారిద్ర్య నిరసనం. ఈ నాలుగు అంశాల పునాదులమీదనే ఇతని సంఘ సంస్కరణ కవితా నిర్మాణం జరిగింది.

జాషువా ఆలోచనాసరళికి హేతువాదం మూలం. అంతర్యాన్ని పరిశీలించడం, అసమానతను ప్రశ్నించడం, అన్యాయాన్ని ప్రతిఘటించడం ఇతని హేతువాదశీలానికి ఆయువు పట్టులు. గొర్రెలు తలలు వంచుకుని వెళ్ళిపోతాయి. పసునైన ఖుర్రలు ఎదురు తిరిగి ప్రశ్నిస్తాయి; పెత్తందారులను, గుత్తాసాములను, స్వార్థపరాయణులను, పరాన్న భుక్కులను, కుహనాభక్తులను, చిత్తశుద్ధి లేని పూజారులను-చివరికి దేవుళ్లను—

> "ముసుగులో గుద్దులాటలు పొసగవింక
> హక్కుగలదయ్య ప్రశ్న సేయంగ నిన్ను"

అని సూటిగా దేవుణ్ణి సవాలు చేసింది ఈ హేతువాదబలంతోనే. ఆదిదేవుణ్ణే ప్రశ్నించిన జాషువా వ్యాసుణ్ణి ప్రశ్నించడంలో ఆశ్చర్య మేముంది?

వ్యాసమునీ ! భారతమును
వ్రాసిన కవినాథ ! పాండురాజ సుతులలో
దోసములేదా ? యేదీ
నా సంశయములు నివారణము సేయగదే !

భీష్మని సంహార రహస్యాలను అడిగి తెలుసుకున్న ధర్మరాజును, 'అశ్వత్థామహతః' అని బొంకినట్లు బొంకి పబ్బం గడుపుకున్న ధర్మరాజును, ఏకలవ్యుని బొటనవ్రేలును సుతారంగా తప్పించి పాండవ పక్షపాతాన్ని ప్రదర్శించిన ద్రోణాచార్యుణ్ణి, ఒక్కొక్కరి అక్రమాన్ని పేరుపేరున నిలదీసి అడిగాడు.

అస్పృశ్యుల్లో 'మాల', 'మాదిగ' లనే రెండు తెగలుండటం, అవి కక్షలకూ, కలహాలకూ దారితీయడం ఈ కవికి సంతాపహేతువులైనవి. అగ్రవర్ణాల దౌష్ట్యాన్ని ఎంత నిర్భయంగా ఖండించాడో, అంతిమవర్ణాల అజ్ఞానాన్ని అంత నిష్పాక్షికంగానే నిరసించాడు.

మాలా? తోలా? యనుకొని
తెలుచుకొనకుండ కెరద తృప్తిపడరు మా
మాలల మాదిగలు జగ
త్పాలక! మతబోధలేల? ప్రార్థనలేలా?

## అభ్యుదయభావన:-

అభ్యుదయ కవిత్వానికి మార్క్స్ ప్రతిపాదించిన వర్గసంఘర్షణ సిద్ధాంతం ప్రాతిపదిక. సంఘంలో ఉన్నవారూ, లేనివారూ, రెండువర్గాలనీ ఈ ఉభయవర్గాలకు నిరంతర సంఘర్షణం అనివార్యమనీ అయితే అంతిమ విజయం పీడితవర్గానిదే అనీ మార్క్సువాద సారాంశం.

జాషువా భావకవిత్వయుగంలో కలంపట్టి అభ్యుదయకవిత్వయుగంలో అంచులు ముట్టినకవి. అభ్యుదయకవిత్వంలోని వర్గసంఘర్షణం, ఆర్థికవ్యత్యాస నిర్మూలనం, దోపిడీవర్గాలపై తిరుగుబాటు, సమసమాజ నిర్మాణం, సమరవిముఖత, శాంతిప్రియతవంటి ఆశయాలు జాషువా కవిత్వంలోనూ ప్రస్ఫుటంగా కనిపిస్తాయి. అయితే ఇతని వాణివేరు; బాణివేరు. అభ్యుదయకవులు స్వీకరించిన గేయచ్ఛందస్సునూ, వచనకవితారీతిని ఇతడు చేపట్టలేదు, శిష్టవ్యావహారికశైలిని అభిమతించలేదు. వ్యవహారసన్నిహితమైన గ్రాంథికశైలిలో లక్షణబద్ధంగా సాగే పద్యాలను రచించాడు. అభ్యుదయకవిత్వానికి అనివార్యమైన వాస్తవికతావాదాన్ని భావకవిత్వ

యుగంలోనే స్వాయత్తం చేసుకున్నాడు. అయితే ఇతనిది మార్క్స్ దారికాదు. మహాత్మపథం, మహాబోధి ద్రుక్పథం. అందుకే భావకవులకంటె అభ్యుదయకవులే ఇతనికి ప్రీతిపాత్రులైనారు. కేవల ప్రకృతి వర్ణనాలంపటులైన భావకవులను నిశితంగా విమర్శించాడు.[1] సమకాలీనులైన అభ్యుదయ కవులను నిండుగుండెతో సమర్థించాడు.

మాకవు లాలపింతురు సమంచిత నవ్యయుగోచితంబులై
ఆకటి చిచ్చులార్చు హృదయప్రవిదారి దయా కథాంశముల్.[2]

అన్న పంక్తుల్లో ఆతని యుగోచితప్రగతి దృష్టి అగుపిస్తుంది. ఆకలిపైన తిరుగుబాటు చేసే విషయంలో ఇతనిది అచ్చంగా అభ్యుదయకవులదృక్పథమే.

రేడియోను ఉద్దేశించి వ్రాసిన పద్యాల్లోనూ అన్నార్తుల ఆక్రందననే ధ్వనింప జేశాడు.

రేయిబవలు భారతీయసంస్కృతి పేర
గండశిలలు చూపి కథలు చెప్పి
కటికిపేదవాని కడుపులోగల చిచ్చు
గడపగలవె నీవు గగనవాణి.

ఆస్తి ఏ ఒక్క వర్గం గుత్త సొత్తుగా ఉండరాదనీ, అది అందరికీ సమంగా అందాలనీ ప్రబోధించిన అభ్యుదయకవిత్వ సిద్ధాంతాన్ని ఇతడూ ప్రబోధించాడు.

సహజమైన ప్రకృతి సౌఖ్యంబు లోక వ్యక్తి
దొంగిలించి మనుట దొసగునాకు.

ఈ పంక్తుల్లో దోపిడీవర్గాలపై ధ్వజమెత్తిన తిరుగుబాటు కనిపిస్తున్నది. స్వరాజ్యం సంపాదించి మూడు సంవత్సరాలైంది. ఏమిటి నీవు సాధించిన ప్రగతి? 'మారుపల్క వేమి మంతిరన్న' అంటూ ఆరోజుల్లోనే పాలకులను నిలదీసి ప్రశ్నించాడు.

కాలం గడిచిన కొద్దీ జాషువా కవిగానే కాకుండా వ్యక్తిగానూ మహోన్నతంగా ఎదిగిపోయాడు.

మత పిచ్చిగాని వర్ణో
న్నతిగానీ స్వార్థ చింతనముగానీ నా
కృతులం దుండదు, శర్వా
కృతి బ్రహ్మానందలక్ష్మి నృత్యమ్మొనర్చున్.

---

1) పూదోటల మదబంభర
నాదముల విలాసవతుల నడబెడగుల నా
హ్లాదించు కవులకీ నిరు
పేదల ఆక్రందనములు వీనులబడునా? —ముసాఫర్లు

2) కాందిశీకుడు.

అని 'కొత్తలోకము' అనే కావ్యంలో చెప్పుకున్నాడు. "హృదయము గలట్టి నవ రచయితను నేను" అని వార్థక్యంలోనూ నిత్యనూతనత్వాన్నే అభిలషించాడు. కమ్మని వాక్కుల్లో సత్యాన్ని నిర్భయంగా అందించిందే కవిత్వమని చాటి చెప్పాడు. తొలిరోజుల్లో "గడనకెక్కిన ఆంధ్రపుత్రుకను నేను" అని గానం చేసిన జాషువా "భరత ఖండంబు నా పాఠశాల" అని మననం చేసిన జాషువా క్రమక్రమంగా

"నిఖిల లోకమెట్లు నిర్ణయించిన నాకు
తిరుగులేదు విశ్వనరుడ నేను"

అనే విశ్వజనీన దృక్పథాన్ని అలవరచుకున్నాడు. అలాంటి సువిశాల దృక్పథం ఉండడం వల్లనే ప్రపంచ స్థాయిలో ఏ మూలలో, ఏ మాత్రం మంచి జరిగినా, కవితా రూపంలో ప్రశంసించాడు. చెడు జరిగితే అభిశంసించాడు.

కవిత్వంకోసం కవిత్వం వ్రాయడం, వర్ణనలకోసం వర్ణనలు చేయడం, చిన్న విషయం చిత్రించడానికి ఎన్నెన్నో రంగులు పూయడం జాషువా ప్రవృత్తికి సరిపడదు. అంతమాత్రాన భావచిత్రాలు వేసే సమర్థత లేనివాడని నా అభిప్రాయం కాదు. ఒక్క దృశ్యాన్ని కళ్ళముందు కట్టించడానికి, ఒక్క సన్నివేశాన్ని మనసు కెక్కించడానికి అక్కరలేనన్ని మాట బొమ్మలు గీసే కవుల కోవలోని వాడుకాడితడు. ఒక దృశ్యాన్ని చిత్రించడానికి ఒకే బొమ్మ వేస్తాడు. అది చాలు హృదయంమీద మృదుల ముద్ర వేయడానికి గబ్బిలాన్ని గురించి ఇలా అంటాడు.

ముక్కు మొగమున్న చీకటి ముద్దవోలె
విహరణము సేయసాగె గబ్బిల మొకండు.

గబ్బిలాన్ని రూపు కట్టడానికి ఇంతకు మించిన ఉపమానం ఎక్కడ దొరుకుతుంది? గబ్బిలం కాళ్ళు పైకి సాచి తిరుగుతూ ఉంటుంది. దానికి కవి ఉక్తి చమత్కృతితో పలువిధాలుగా వ్యాఖ్యానాలు చేయవచ్చు. కాని జాషువా చూపిన కారణం అతని భావుకతా చమత్కృతికీ, వాస్తవికతా పరిణతికీ ఎత్తిన దీపంలా భాసిస్తున్నది.

నరుని కష్టపెట్టి నారాయణుని గొల్చు
ధర్మశీలురున్న ధరణిమీద
కాలు మోపలేక గబ్బిలమొక్కటే
చరణ యుగళి దివికి సాచి నడచు.

మెత్తని అధిక్షేపంతో మాట బొమ్మను కట్టి చిత్తాలకు హత్తుకునేటట్టు చేయడంలో ఇతడు సిద్ధహస్తుడు.

ఇతడు ప్రధానంగా కరుణ రసాలను అప్పుడప్పుడు హాస్యరసాన్ని పోషించినా, శృంగార రసాన్ని స్పృశించకపోలేదు.

'ముంతాజమహల్ కావ్యం సంయోగ వియోగ శృంగారాలను సమభంగిలో చిత్రించిన రసవత్కృతి. షాజహాను, ముంటాజమహలుల ప్రగాఢ ప్రణయాన్ని, సుమధుర సంయోగ సన్నివేశాలనూ ఎంత సుందరంగా, సభ్యతా బంధురంగా చిత్రించాడో ఈ పద్యం చెబుతుంది.

ఆ సతీపతుల గాఢాశ్లేషముల నుండి జారిపోయిన నిమేషంబులేదు
ఆ దంపతులకు నాహ్లాదంబు గూర్పక తొలగిన వెన్నెల తునకలేదు
ఆ ప్రేమజీవుల అనురాగ వృద్ధికై రుత మొనర్పని పరభృతములేదు
ఆ శుభాకృతుల నెయ్యంపు ముద్దులచేత తీపి కెక్కని ద్రాక్షతీగలేదు

అవధిలేని వారియానంద కేళికి
తోడు పడని పూలతోటలేదు
వారి కూర్మి పెంపు వలచి వర్ణనజేసి
సుప్రసిద్ధిగనని సుకవి లేదు.

తాను పొందిన అనుభూతికి రమణీయ శబ్దాకృతి ఘటించడంలో ఇతని కున్న పని తనాన్ని 'శిశువు' చెబుతుంది. 'శ్మశాన వాటిక' చాటి చెబుతుంది.

నవమాసములు భోజనము నీర మెఱుగక పయనించు పురిటింటి
బాటసారి
చిక్కు చీకటి చిమ్ముజేసెడు పొట్టలో నిద్రించి లేచిన నిర్గుణుండు
నును చెక్కిళుల బోసినోటి నవ్వులలోన ముద్దులు చిత్రించు
మోహనుండు
అక్షయంబైన మాతృక్షీర మధుధార లన్నంబుగా తెచ్చుకొన్న యతిథి
బట్టగట్టడు బిడియాన పట్టువడడు
ధారుణీపాఠశాలలో చేరినాడు
వారమాయెనో ; లేదొ ? మా ప్రకృతికాంత
కలపియున్నది వీని కాకలియు నిద్ర —'శిశువు'

ఆ పద్యంలో ఆలోచన, ఆలాపన ఎంత అందంగా చెట్టపట్టా వేసుకున్నాయో !

'శ్మశాన వాటికలోని ప్రతిపద్యం తీవ్రమైన అనుభూతికీ రసనిర్భరమైన వాగ్గీతికీ ఒక ప్రతీక.

ఇచ్చోట ; నేసత్కవీంద్రుని కమ్మని కలము, నిప్పులలోగ అగిపోయె!
యిచ్చోట ; నేభూములేలు రాజన్యుని యధికారముద్రిక అంతరించె !
యిచ్చోట ; నే లేత యిల్లాలి నల్లపూసల సౌరు, గంగ గలసిపోయె!
యిచ్చోట ; నెట్టి పేరెన్నికంగనుగొన్న చిత్రలేఖకుని కుంచియ,
నశించె!

ఇది పిశాచులలో నిటలేక్షణుండు
గజ్జె గదలించి యాడు రంగస్థలంబు
ఇది మరణదూత తీక్ష్ణమౌద్రుష్టు లొలయ
నవని పాలించు భస్మ సింహాసనంబు.

ఆలోకించిన గుండియల్గరుగు; నా యా పిల్లగోరీలలో
నే లే బుగ్గల సోరు రూపశిఖయెనో యే ముద్దు నిద్రించెనో?
యే లీలావతి గర్భగోళమున వహ్నిజ్వాల జీవించునో?
యీ లోకంబున వృద్ధి గాదగిన యే యే విద్య లల్లాడునో?

జాషువా కవీంద్రునిలాగే అనేక పర్వ విభక్తమైన మహాకావ్యం వ్రాయలేదు. వ్రాసినవన్నీ లఘుకావ్యాలు, ఖండకావ్యాలూ. రసావేశంలో ఊగిసలాడి ఝటితి స్ఫూర్తితో కవిత్వాన్ని విసరేకవి నెలలకొద్ది నిలకడగా కూర్చొని గ్రంథరచన చేయడు. జాషువా మౌళికంగా, ఆవేశం తరుముతుంటే కలం అందుకున్న కవి. అందుకే ఆకలం నుంచి రాసులు రాసులుగా 'పిరదౌసి' 'గబ్బిలము' 'ముంతాజ్‌మహలు' 'కాందిశీకుడు' 'స్వప్నకథ' 'బాపూజీ' 'నేతాజీ' 'స్వయంవరం' 'ముసాఫర్లు' 'క్రీస్తు చరిత్రము' 'కాత్తలోకము' వంటి లఘు కావ్యాలూ, ఏడు 'ఖండకావ్య' సంపుటాలూ, మూడు 'నాకథ'లూ వెలువడ్డాయి.

ఆధునికాంధ్ర కవిత్వంలో ఖండకావ్య ప్రక్రియ రాయప్రోలుతో పొటమరించినా, పుష్పించింది జాషువా కవితలోనే: ఖండకావ్యం వ్రాసి అఖండ కావ్యస్ఫూర్తిని అందించిన కీర్తి జాషువాకే దక్కింది.

తెలివికి కలిమిలేములతో నిమిత్తం లేదనీ, ప్రతిభను కులమతాల తక్కెడలో తూచరాదనీ, విశ్వసించి తన జీవితమంతా ఆ విశ్వాసాన్నే కవిత్వంగా విశ్వసించిన జాషువాలోని ప్రతిఘటన దృక్పథాన్ని ఆవిష్కరించడానికి ఈ ఒక్కపద్యం చాలు,

గవ్వకుసాటిరాని పలుగాకులమూక లసూయచేత న
న్నెవ్విధి దూరినన్ నను వరించిన శారదలేచి పోవునే?
యివ్వసుధాస్థలిం బొడమరే రసలుబ్ధులు? గంట మూనెదన్
రవ్వలు రాల్చెదన్ గరగరల్ పచరించెద నాంధ్రవాణికిన్

'ఎవ్వరేమన్న నంద్రు నాకేమి కొఱత' అని ప్రత్యర్థులను ధిక్కరించిన శ్రీనాథుడు ఎక్కడైనా, ఎప్పుడైనా ఈ 'మధుర శ్రీనాథుణ్ణి'1 కలుసుకుని, పైపద్యం వింటే ఒళ్లు మరచి అమాంతంగా కౌగిలించుకోకుండా ఎలా ఉంటాడు? ఔను.

కవుల వర్ణాతీతులు కదా!

---

1) జాషువా మరో బిరుదు.

